పశ్చేసి యెడమచేతివ్రేళ్ళయందు క్రింద స్రుక్కు పైన స్రువమునుండునట్లుగా ధరించి కుడి చేతనున్న దర్భలయొక్క అగ్రములచేత స్రువముయొక్క లోనిభాగమును ప్రదక్షిణముగా సంమార్జనముజేసి పిమ్మట దర్భాగ్రములచేతనే బిలముయొక్క వైభాగమును ప్రదక్షిణముగాతుడచి దండమును దర్భమూలములచేత మూలముమొదలుకొని బిలమువరకు వున్న భాగమును ప్రదక్షిణముగా తుడచి పిదప స్రువమును క్రిందను స్రుక్కును పైనను ధరించి ఆ స్రుక్కునున్నూ బిలమునందు దర్భాగ్రములచే మూడుపర్యాయములు సమ్మార్జనచేసి బిలము మొదలుకొని అగ్రమువరకు తూర్పుగానున్నూ అగ్రము మొదలుకొని బిలపర్యంతము క్రిందిభాగమును పశ్చిమముగానున్నూ సంమార్జనముచేసి దండమునుమాత్రము వెనుకటివలెనే దర్భమూలములచేతనే క్రమముగా సంమార్జనముజేసి అట్టి స్రుక్స్రువములను హస్తములచేగొని వెనుకటివలెనే తపింపజేసి కుశలచే ప్రోక్షించి ఆ స్రుక్స్రువములను క్రమముగా అగ్నిసమీపమునందుంచి సంమార్జనజేసిన దర్భలను తడిపి అగ్నియందుంచవలయును.

## ఇధ్మ లక్షణము.

సమిధయొక్కయు, ఇధ్మముయొక్కయు, పరిధులయొక్కయు, స్థూలత్వముయొక్క ప్రమాణమును పెద్దలయొక్క వచనములవలన తెలియనగు, కనిష్ఠికయందలి అగ్రపర్వముతోసమమగు లావుగలదిగా సమిధయుండవలయును అని గృహ్యభాష్యమునందు నిశ్చయింపబడినది. అట్లే అనామికాంగుళియొక్క అగ్రపర్వముతో సమానమగు ప్రమాణముగలిగి ఇధ్మముండవలయును మిగిలినమూడు వ్రేళ్ల యొక్క అగ్రపర్వలతో సరియగు లావుగలిగి పరిధులుండవలెను. ఈకనిష్ఠాద్యంగుళులకెట్లు తారతమ్యముగలదో అట్లే సమిధేధ్మపరిధులకును తారతమ్యముగలదు, అదియెట్లన సమిధ, పవిత్రము, వేది, ప్రాదేశప్రమాణములు ఇధ్మను రెండు ప్రాదేశములప్రమాణముగలది, పరిధి మూడు ప్రాదేశములప్రమాణముగలది ఇధ్మసమిధలు రెండుప్రాదేశములపొడవుగలిగిగాని వితస్తిప్రమాణముకలిగిగాని యుండవలయును వాటిసంఖ్య ఇరువదియొకటి, అందు మూడుపరిధులు రెండాఘారసమిధలు అనూయాజసమిధయొకటి ఇధ్మపమిధలు పదునేను ఇధ్మాసాదనముచేసిన తావున నే సమిత్సన్నహనమునుంచవలయును, స్వయముగానే యెండినసమిధ మృత్యుకరము. కృశించినది వ్యాధికరము చీల్చబడినది కలహప్రదము మితిమించినలావుగలది భయకారణము విరిగిన సమిధను ఏమాత్రము అగ్నియందుంచినను పత్నీనాశకరము ఎండిచిట్టిపట్టుగలసమిధ పశుబంధునాశకరము మితిమించినపొడవుగలది ధననాశకరము మితికిదగ్గినప్రమాణముగలది (పొట్టిది) సంతాననాశకరము మోదుగు, చండ్ర, రావి, కాండ్రేగు, జమ్మి, మర్రి,

జువ్వి, మేడి, మారేడు, ఈవృక్షములు శుభప్రదములైనవి కాన, వీటియొక్క స్కంధము, కణుపులు కాని శాఖలు ప్రాదేశమాత్రములు పట్టుగల వంకరలేనివి దోషవర్జితములైనవి గ్రహింపదగు మోదుగుసమిధలు సంగ్రహించినది మొదలు పక్షమువరకు పరిశుద్ధము మేడి, రావి, ఇవిమూడురోజులవరకే పరిశుద్ధములు ఉత్తరేణి ఆదినమునందేయోగ్యము చంద్ర, జిల్లేడు, కుశ, గరిక, జమ్మి, ఇవితత్కాలమునందుమాత్రముపయోగించును సమిధలు, పువ్వులు, కుశలు, మొదలుగాగలవి బ్రాహ్మణుడు తానేసంగ్రహించుకొనదగు శూద్రునిచే తేబడినవి బంధునాశకరములు కాన విడువదగినవి శూద్రునిచే తేబడినట్టియు కొనబడిన ట్టియు సమిదాదులచే కర్మచేసినచో అధఃపతనముకలుగును, పిడుగుచేదగ్ధములైనవి గిడస బారినవి అగ్నిదగ్ధములైనవి విడువవలయు చేతిచేత్తృంపబడినట్టియు స్వయముగా ఎండిన ట్టియు పాపాత్ములు మొదలగువారిచే విక్రయింపబడినట్టియు మలము అమేధ్యము మొద లగువాటిచే పూయబడినట్టియు సమిధలుదోషప్రదములు.

## పరిధుల నాసాధించుట.

దక్షిణపరిధియొక్క మూలమును మధ్యమపరిధియొక్క పైభాగమునను ఉత్తరపరిధి యొక్క మూలమును క్రిందిభాగమునను ఉంచవలయు కుడిచేత ఊర్ధ్వముఖములుగా రెండు సమిధలను ఒకపర్యాయముగ్రహించి మధ్యమపరిధిని స్పృశించి ఆగ్నేయదిశయందొకటియు ఈశానదిక్కునందొకటియు ఊర్ధ్వముఖములుగాస్థాపింపవలయును. అన్నికర్మలయందును ఆఘారసమిధలు ఇట్లేనని సూత్రము.

## ప రి షే చ న ము .

అదితేనుమన్యస్వ అనునది మొదలగు మంత్రములచే అగ్నినియథావిధిగా పరిషేచిం పవలయు.

## గ్రంథాంతరమందు.

పరిస్తరణలకు లోపలిభాగమునందు పరుధులును ఆపరిధిపరిస్తరణలకు మధ్యభాగము నందు పరిషేచనమును చేయదగినదని కపర్దిశిష్యులచే చెప్పబడెను, ఇట్లుపరిషేచనము చేయ వలయు స్థండిలమునకు పదునొకండు పది తొమ్మిది ఎనిమిది అంగుళములు వ్యవధానము గలప్రదేశములయందు క్రమముగా అలంకరణము పరిస్తరణ పరిధి పరిషేచనములు కాదగు.

## ఇధ్మప్రక్షేపణము.

ఇధ్మమునాసాదించినప్రదేశమునందు అనూయాజసమిధను ఇధ్మసన్నహనమును వదలి కుడిచేత పదునేనుసంఖ్యగల ఇధ్మమునుగ్రహించి ఎడమచేత ఆయిధ్మమునంతను

గ్రహించి అనంతరమునందు యథావిధిగా ఒకటి రెండు అని లెక్కించుచు ఇధ్మసమిధల పను నేనిటిని స్రువముచే గ్రహింపబడిన ఆజ్యముచేత తడుపవలయును పిదప ఆసనమునుండి కొంచెము లేచి అచటనున్న బ్రాహ్మణులయనుజ్ఞగొని అమంత్రికముగా ఇధ్మాధానము చేయవలయును హస్తముచే గ్రహించి కూర్చుండియే అగ్నియందుంచవలయును సమిత్ప్రక్షేపణమునందును సర్గ్ స్రావహోమమునందును అఘారహోమమునందును ఇధ్మాధానమునందును స్వాహాకారణమును వర్జింపదగు.

## అ ఘా ర హో మ ము .

ప్రథమాఘారహోమమును స్రువముచే ఆజ్యమునొకసారి గ్రహించి కూర్చుండియే వాయవ్యదిశనుండి ఆగ్నేయదిశవఱకు వంకరలేకుండునట్లుగాను విచ్ఛిత్తిలేకుండునట్లుగాను ప్రజాపతిని మనస్సుచే ధ్యానించుచు అమంత్రికముగా హోమముచేయవలయును ద్వితీయాయాఘారహోమమును ప్రధానదర్వియందు సకృద్గ్రహణముజేసి (అనగా స్రువముచే అజ్యమునొకసారి స్రుక్కునందుంచి) నిర్ ఋతిదిశ మొదలు ఈశానదిక్కువరకు మనస్సుచే నిందుృనిధ్యానించుచు చేయవలయును ఇది అఘారములయొక్క నిర్ణయము.

## చ క్షు స్సు లు .

అగ్నికి పూర్వార్థమునందు జేయబడు ఆజ్యభాగలు చక్షుస్సులనంబడు అందును ఉత్తరభాగమునందాగ్నేయము దక్షిణభాగమునందు సౌమ్యమును చెప్పబడియున్నది.

## ము ఖా హు తి .

ముఖాహుతి అగ్నికి మధ్యభాగమునందు జేయదగినది అచ్చటనే ఆజ్యభాగలైన తరువాతచేయబడుహోమములుగూడ జేయదగువాల్లు వేదవ్రతములయందును ముఖాహుతి ఆవశ్యకమని ఆచార్యులందరిచేతను నిశ్చయింపబడినది, ముఖాహుతిజేయవలసినపుడు స్రువముచేనొకసారి స్రుక్కునందుగ్రహించి హోమముజేయవలయునని నిర్ణయము. అన్ని కర్మలయందును సంస్కారముచేసెడివాడు ఉత్తరభాగమునందుండవలయును సంస్కారము నొందెడి పురుషుడుగాని స్త్రీగాని దక్షిణభాగమునందుండవలయును ఇట్టివ్యవస్థ కపర్దిమొదలగువారిచే నిర్ణయింపబడినది కాన స్మార్తకర్మలయందిట్లుచేయుదగు.

## స్రుక్స్రువములను ధరించుకీతి.

స్రువము నగ్రమునందుధరించినచో విఫలము మధ్యయందుధరించినచో సంతానక్షయము మూలమునుధరించినచో హోమమునుచేసినవాడు మృతినొందును ఇంక స్రువస్థాన

మెట్లన· అగ్రమునకు మధ్యభాగమునకు మధ్యనగాని మూలమునకు మధ్యభాగమునకు మధ్యనుగాని స్రువమును ధరింపనగు మూలమునకు మధ్యమునకు మధ్యభాగమును అంగుళుల యందు మధ్యములగు మధ్యమానామికలచేతను అంగుష్ఠముచేతను స్రువమును గ్రహించి హోమముచేసినచో సంతోషము పుత్రపౌత్రాభివృద్ధి సర్వకార్యార్థసిద్ధియు కలుగును.

## ఆహుతి లక్షణము.

సకారముచ్చరించునపుడు సూతకము కాన ఆహుతినుంచదగదు వకారముచ్చరించునపుడుంచినచో శత్రువులకభివృద్ధికలుగును హాకారమునందు వ్యాధిపీడకలుగు కాన మూడువర్ణములను బాగుగానుచ్చరించి ఆకారమునందాహుతినుంచదగు అట్లుచేసినచో ఆయుష్యము లక్ష్మి కలిగి దేహాంతమునందు బ్రహ్మలోకమునందు పూజింపబడుదురు.

## ఆహుతి ప్రమాణము.

అటిచేతియందుంచి వేల్చబడు హోమద్రవ్యము (తండులాహుతి) వ్రేళ్ళయొక్క పండ్రెండుకణుపులను పూరించునదిగాయుండవలయును పక్వద్రవ్యము రేగిపండుప్రమాణముగానుండవలయు ఆజ్యాహుతి మినుపగింజమునుగదగిన ధారగలిగి అగ్నికి పండ్రెండంగుళములు యెత్తుగాయుండవలయు అన్నము అంగష్ఠమాత్రము లాజలు పిడికిలి ప్రమాణము తిలలు ఆవాలు పిండి ఇవి ముత్యపుచిప్ప ప్రమాణముగానుండదగు.

## హోమముద్రలయొక్క లక్షణము.

మృగి, హంస, సూకరీ, అను నీమూడును హోమముద్రలు మధ్యమము అనామికము అంగుష్ఠము ఈ వ్రేళ్ళచే హోమముచేసినచో నాముద్ర మృగియనబడు ఇది సర్వకార్యములయందును తగు తర్జని మధ్యమ అంగుష్ఠము ఈ వ్రేళ్ళచే హంసియనుముద్రయగు యిది శాంతికర్మయందుపయోగించును అన్ని వ్రేళ్ళచేజేయబడినది సూకరీముద్రయగు ఇది ఉగ్రకర్మలయందుపయోగింపనగు ముద్రాహీనమగు హోమము నిష్ఫలమగు సమిధను హంసముద్రచేతను ఆజ్యమును మృగముద్రచేతను చరువును సూకరముద్రచేతను వేల్చదగు.

## స్రువాహుతి.

మొదటి అఘారహోమమును ప్రధానాహుతులయొక్క అనంతరము చేయబడు హోమములన్నియు (అనగా జయాదులు వ్యాహృతులచేజేయబడు ప్రజాపతిహోమము

స్విష్టకృత్ప్రాయశ్చిత్తహోమములు ప్రాయశ్చిత్తహోమములు ఇవి స్రువముచేతనే జేయదగినవి స్రువముచే జేయబడు హోమములయందాజ్యమును అస్రువముచేతనే గ్రహింపజేయదగునని కపర్దిచే నిశ్చయింపబడెను ద్వితీయాఘారహోమము ప్రధానాహుతులు ఆజ్యభాగములు ఇవి స్రుక్కుచేతనే హోమముచేయదగు స్రుక్కుచే హోమము జేయబడు తావులస్రువముచే నాజ్యమునుగ్రహించియే జేయవలయునని నిర్ణయము.

## నిలుచుండి జేయదగు హోమములు

పూర్ణాహుతియు రెండవఆఘారహోమమును ఫలీకరణహోమమును మేడిసమిధచే జేయబడుహోమమున్ను లలాటహోమమును లాజహోమము ఇవి నిలుచుండిజేయదగినవి.

## గ్రంథాంతరమునందు.

జాతకర్మమందుజేయబడు ఫలీకరణహోమము సౌమ్యవ్రతమునందలి సమిధల యొక్కహోమము ఇంద్రదేవతాకమగు ద్వితీయాఘారహోమము శ్రౌతకర్మయందలి పూర్ణాహుతియు వివాహమునందలి లాజహోమమును శేషహోమానంతరము ఆజ్యశేషముచే వధూయొక్కశిరస్సునందు భూస్స్వాహా, భువస్స్వాహా, సువస్స్వాహా, ఓగ్ స్స్వాహా, అనివ్యాహృతులచేతను ఓంకారముచేతను చేయబడు హోమములున్ను ఇవి నిలుచుండియే చేయవలయు ద్వితీయాఘారహోమము పూర్ణాహుతి ఇవిరెండును శ్రౌతకర్మయందు నిలుచుండియు స్మార్తకర్మయందు కూర్చుండియు జేయనగు స్మార్తకర్మలయందంతటను స్రుక్కుచే జేయబడుహోమములను కూర్చుండియేజేయవలయు.

## అనూయాజసమిధను ఇధ్మసన్నాహమును అగ్నియందుంచుట.

ప్రధానాహుతులకు అనంతరము అనూయాజసమిధను ఇధ్మసన్నహనమును అగ్నియందుంచదగు దీనికిమరియొక కాలములేదు ఇట్లు కపర్దిచే నిశ్చయింపబడెను.

## మరియొక విశేషము.

యదస్యకర్మణః అనుమంత్రమునకు ముందుగాని జయాదిహోమమునకు వెనుకగాని అనూయాజసమిధను ఇధ్మసన్నహనమును అగ్నియందుంచదగు ఇంతకంటె మఱియొక కాలములేదు. స్మార్తమునందెచ్చట ఇధ్మతంత్రము జరుగునో అచ్చట అనూయాజసమిధను ఇధ్మసన్నహనమును ఉదకములచే స్పృశించి అమంత్రకముగానుంచదగు ఇధ్మసన్నహనమును తండ్రివరుడగు రుద్రునికొఱకుంచవలయు.

## జయాదిహోమము.

రెండుమాసములలోపగడ జయాదిహోమము చేసియున్నచో మతాంతరముచే తిరిగి ఆజయాదిహోమము జేయ కొందరుపండితులొప్పరు.

## పరియోగసారమునందు.

మూడుమాసములకులోపగడ జయాదిహోమమును జేసియున్నచో ప్రధానహోమములనుమాత్రముచేసి జయాదులను వదలదగు అంతకుమించినచో జయాదులను క్రమముగా జేయదగు చిత్తాదిమంత్రములయందు మంత్రముయొక్క ఆదిపదముచే దేవత చెప్పబడు అభ్యాతహోమములయందు (అనగా అగ్నిర్భూతానామధిపతిః) అనునది మొదలు గాగల పశునేమమంత్రములయందు మంత్రముయొక్క మొదటిమూడుపాదములచేత దేవత చెప్పబడు, పిత్రాదిహోమమునందు పితరులు పితామహులు ప్రపితామహులు తతులు తతామహులు దేవతలు లేక విశ్వేదేవతలు దేవతలు తండ్రియున్నచో పితృశబ్దమును విడువదగు పితామహుడునుయున్నచో హోమమునుమాని మంత్రమును జపింపదగు.

## గ్రంధాంతరమందు.

ఎవనికి తండ్రి మొదలగువారు జీవించియుందురో వారికీహోమములేదు ఒకడుమాత్రము జీవించియున్నచో తద్వాచమగు శబ్దమునువదలి మిగిలినమంత్రము నుచ్చరింపదగు.

## రాష్ట్రభృద్ధోమము.

రాష్ట్రభృత్తులనగా "ఋతాషాట్" ఇత్యాదిమంత్రములయందు మూడు నాల్గు పదములచే చెప్పబడునట్టియు తిరిగి ఆనాల్గవపదము మొదలుగాజేసి పరిగణింపగా మూడు నాలుగు ఐదు పదములచే జెప్పబడువారును దేవతలు ఒకటి రెండు పదములు విశేషణములుగా అన్వయింపదు భువనస్పతె అను మంత్రమందు ఆదిపదద్వయము వేతనే దేవత చెప్పబడు "ప్రజాపతెనత్వదేతాని" అనుమంత్రమునందాదిపదముచేత దేవత చెప్పబడు ఆపస్తంబమతావలంబులు అన్నికర్మలయందును రాష్ట్రభృత్తులను కలపిచేయదగును మౌంజీబంధనము స్నాతకము గోదానము వృషోత్సర్జనము చౌలము వేదవ్రతములునాల్గు వీటియందు మాత్రము విడిగాజేయదగు.

## గ్రంధాంతరమునందు.

గోదానము చౌలము ఉపనయనము వేదవ్రతములు స్నాతకము పునస్సంధానము వేదవ్రతోత్సర్జనము ఉపాకర్మ దేవతాప్రతిష్ఠ ప్రాయశ్చిత్తము వీటియందు రాష్ట్రభృద్ధోమములను విడి విడిగాజేయనగు.

## జయాదులు అగ్నిముఖముచేయదగిన కర్మలు.

వివాహము యద్వ్రదాదిహోమము ప్రాయశ్చిత్తము గృహప్రవేశము సమావర్తనము (స్నాతకము) సీమంతము చౌలము పుంసవనము వాస్తుకర్మ శేషహోమము ఉపనయనము పలాశహోమము ఆగ్రయణము సర్పబలి వీటియందు అగ్నిముఖము జయాదులు చేయనగు అష్టకాశ్రాద్ధములు దధ్యంజలిహోమము ఈశానబలి వృషోత్సర్జనము హృదయసంసర్గము గోదానము స్వాధ్యాయము వ్రతచతుష్టయము తదుత్సర్జనములు ఉపాకర్మ వీటియందు ముఖాహుతి అగ్నిముఖము జయాదులుచేయనగును.

## జయాదులు వర్జింపదగుకర్మలు.

సర్పబల్యుత్సర్జనము, మాసిశ్రాద్ధము గృహస్తంభము విరుగుటవలన చేయదగు ప్రాయశ్చిత్తము ప్రతిపత్ స్థాలీపాకము ఆగ్నేయస్థాలీపాకము ఈకర్మలయందు జయాదులులేవు మట్టాత్రము ముఖాహుతియుగలవు.

## గ్రంధాంతరమునందు.

ఆగ్నేయస్థాలీపాకము, ఆగ్రయణము, ఈశానబలి, మాసిశ్రాద్ధము అష్టకలు, దధ్యంజలి, సపిండీకరణము ఈకర్మలయందు జయాదులులేవు.

## స్విష్టకృద్ధోమము.

ప్రధానాహుతులకనంతరమునందు ముఖాహుతి ఏకర్మలయందు చెప్పబడెనో ఆ కర్మలయందు అగ్నయేస్విష్టకృతేస్వాహాయని స్విష్టకృద్ధోమము చేయువలయు స్థాలీపాకములన్నిటియందు చరువుచేతనే స్విష్టకృద్ధోమముచేయదగు.

## లేపకార్యము.

లేపకార్యమనగా స్రుక్స్రువములయందంటిన చర్వాజ్యములయొక్క శేషమును బహిస్సుచే తుడచుట దీనిని శ్రౌతమునందు సమంత్రముకముగాను స్మార్తమునందమంత్రకముగాను చేయదగును స్రుక్కుచే పరిధులను అభ్యంజనముజేసి (హోమశేషమగు ఆజ్యమునుతగిల్చి) పిమ్మట చెప్పబోవురీతిని బహిస్సమంజసము జేయవలయు ప్రయోగార్థములగు దర్భలచే ఆజ్యపాత్రమును స్రుక్కును స్రువమును తుడువవలయు అగ్రములచే స్రుక్కును మధ్యమూలములచే స్రువమును మూడుపర్యాయములుగాని రెండుపర్యాయములుగాని తుడువవలయు మరియొకపక్షమునందు స్రువమును మూలములచే నొకపర్యాయము తుడువవలయును.

## పరిధిపరిహారణము.

మధ్యమపరిధిని ముందుగా అగ్నియందుంచి పిమ్మట దక్షిణోత్తరపరిధుల నొకపర్యాయముగా గ్రహించి ఉత్తరపరిధిని అంగారములయందుగ్రుచ్చుచు దక్షిణపరిధి నగ్నియందుంచవలయును వేదవ్రతములు, పుంసవనము, అధ్యయనము, యాజ్ఞనము వీటియందు పరిధిపరిహారణము చేయదగు శేషకార్యములేదు ప్రయోగకాండయందు సర్వసామాన్యముగా "అఘారసమిధా వాదధాతి" అని విధించుటవలన అన్ని కర్మలయందును అఘారసమిధలను అగ్నియందుంచవలయును అని కపర్దిచే నిశ్చయింపఁబడెను.

## పరిధులు పరిహరింపబడనితావున శమ్యలనబడు.

జయాద్యాహుతులను హోమముజేసి పిమ్మట పశ్చిమపరిధినిముందుగాను దక్షిణోత్తరపరిధుల నటుతరువాత నొకపర్యాయముగాను తీసివేయవలయు వేదవ్రతములు, శాంతిహోమములు, విధ్రిష్టేష్టి, వృషోత్సర్జనము, చరుప్రధానమగుకర్మ వీటియందు శమ్యలగు ప్రధానహోమము, యద్వృదాదిహోమము, ప్రవేశహోమము, శేషహోమము, వ్యాదయసంసర్గము, పైత్రమేధికము వీటియందు శమ్యలగు చౌలము, గోదానము, సీమంతము, స్నాతకము, వివాహము, ఉపనయనము, ప్రాయశ్చిత్తము, వీటియందు పరిధిపరిహారణములేదు.

## సర్గస్రావహోమము.

ఆజ్యపూరితమగు స్రుక్కునొకచేతను స్రువముచేతను విపర్యాసముగా ధరియించి స్రువాగ్రమును స్రుక్కుయొక్క ముఖమునందుంచి సర్గస్రావహోమముఁ జేయవలయును ఏకర్మలయందు పరిధిపరిహారణముకలదో ఆకర్మలయందు సర్గస్రావహోమము విధింపఁబడియె.

## సర్గస్రావనిషేధము.

ఏగృహ్యకర్మలయందు సూత్రముచే శమ్యలు విధింపబడుచున్నవో ఆకర్మలయందు సర్గస్రావములేదు.

## ప్రాయశ్చిత్తాహుతులు.

"అనాజ్ఞాతం" ఇత్యాదిమంత్రత్రయమునకగ్నియు "త్వన్నః" "సత్వన్నః" అను మంత్రమునకు అగ్నీవరుణులును "అభిర్గీర్భిః" అనుమంత్రమునకు హరివదింద్రుడును "ఇదంవిష్ణుః" అనుమంత్రమునకు విష్ణువును సర్వప్రాయశ్చిత్తమునకు ప్రజాపతియు దేవతలు.

## పూర్ణాహుతిలక్షణము.

స్రువముచే పదిరెండుమారులు ఆజ్యమును గ్రహించి స్రుక్కును పూరించిచేయబడు నది పూర్ణాహుతియని యాజ్ఞికులుపల్కిరి.

## పూర్ణాహుతి నిషేధకర్మములు.

వివాహాది సమస్తకర్మలం గృహమునందు జేయబడు వాస్తుహోమము, వ్రతబంధము, వ్రతమోక్షము వీటియందు పూర్ణాహుతిలేదు.

## పూర్ణాహుతిచేయదగిన కర్మలు.

శాంతి, వేదవ్రతములు, తంతుమతీహోమములు, వృషోత్సర్గనము, గ్రహయజ్ఞము, షాహిత్రయోదశహోమము, కామ్యవ్రతములు, పౌష్టికములు వీటియందు పూర్ణాహుతి చేయదగు.

## పూర్ణపాత్రవర్జనము.

స్మార్తకర్మయందమంత్రికముగా ప్రణీతామార్జనమును చేసికొనదగు ప్రస్తర స్థానమందమంత్రికముగా పూర్ణపాత్రము నాసాదించి అందుదకమునుంచి ఆయుదక మును హస్తముచే సమంత్రికముగా ప్రాగాదిపంచదిక్కులయందు సమ్మార్జనముజేసి శేష మును భూమియందుంచదగు. భూమియందున్న యాయుదకమును శిరమునందు ప్రోక్షించు కొని మరియు శేషమును భార్యయొక్క దోసిలియందుంచవలయును, ఇట్లు పవిత్రుడై బ్రహ్మకు తనశక్తికొలది దక్షిణనిచ్చి సభ్యులపూజించి వారియాశీర్వాదముల గొనవలయు ఇవిసర్వకర్మ సాధారణమగు అగ్నిముఖమునకు సంబంధించినకారికలు.

## అగ్నిముఖప్రాయశ్చిత్తము.

సర్వకర్మలయందును తరచుగావచ్చెడి ప్రాయశ్చిత్తముల ముందుగాజెప్పి పిమ్మట విశిష్టప్రాయశ్చిత్తములను స్వతంత్రకర్మలను చెప్పుచున్నాడు. ప్రాయశ్చిత్తనిమిత్తము గల్గుచుండగా ప్రాయశ్చిత్తమునుచేయక జేయఁబడు యజ్ఞముయొక్కఫలము రాక్షసులచే భుజింపబడు కాన ప్రాయశ్చిత్తమావశ్యకము. గొప్పదోషములయందు గొప్పప్రాయశ్చి త్తము, కొద్దిదోషములకు కొద్దిప్రాయశ్చిత్తములుచెప్పఁబడియె. ప్రధానయాగమునకు పూర్వముగాని స్విష్టకృద్ధోమమునకుపూర్వముగాని అట్టిదోషములువాటిల్లుచో ప్రాయశ్చిత్తా హుతులుచేయదగు శ్రౌతకర్మలయందునిట్లేయగు గోమయముచేసలుకబడిన ప్రదేశమును ఖడ్గమృగముగాని దోషమునాపాదించెడి కీటకముగాని అధిష్ఠించినచో ఆప్రదేశమును తిరిగి

“దేవస్యత్వా” అనుమంత్రముచేసలికి యచ్చట స్థండిలమున్నా లిఖింపవలయు ఆస్థండిల మును గోవుగాని అశ్వముగాని యధిష్ఠించినచో పవిత్రోదకములచేప్రోక్షించి “భూమిభూ + మగాత్” అనుమంత్రమును జపింపవలయు.

## ప్రణీతాపాత్రచ్ఛేదనమందు ప్రాయశ్చిత్తము.

ప్రణీతాపాత్రముచ్ఛేదింపబడినచో ఆపాత్రమును ‘అభిన్నోఘర్మః’ అనుమంత్రముచే నభిమంత్రింప నాదోషమునఘర్మదేవతహరించును. పిదప మరియొకపాత్రమును “ఘర్మోదేవానాం” అనుమంత్రముచేపూరించి వ్యాహృతులచే యుపస్థానమును జెప్పి ప్రకృతకర్మనాచరింపనగు.

## స్థాలీభేదమునందు ప్రాయశ్చిత్తము.

స్థాలిభిన్నమైనచో “అభిన్నోఘర్మః” అనుఋక్కుచే మంత్రించి “ఇధ్మోవేదిః” అనుమంత్రముచే చతుర్గృహీతమగు ఆజ్యమును స్రుక్కుచే హోమముచేసి ఘర్మదేవతలను గూర్చి “ ఘర్మదేవాగ్ం అప్యేతు ” అని యుపస్థానమును జెప్పి మరియొక స్థాలిని గ్రహింపనగు.

## దర్భాస్తరణాదివిపర్యాస ప్రాయశ్చిత్తము.

దర్భలచే పరిస్తరణనుంచుట పాత్రలనాసాధించుట స్రుక్స్రువసమ్మార్జనము పరిషేచనము పరిధులనుంచుట పవిత్రమునుచేయుట ఇధ్మమునుంచుట ఆజ్యసంస్కారము ఈక్రియలయందు ప్రమాదమువలన వ్యత్యయముజరిగినచో తంతుమతీహోమములు “ యత్వా కత్రా ” “మనోజ్యోతిః” అనునాహుతులను వ్రేల్చదగు.

## దర్వీకూర్చపవిత్రాదిచ్ఛేద దాహవినాశనమునందు ప్రాయశ్చిత్తము.

దర్వీ, కూర్చ, పవిత్రము, ఇధ్మము పరధులు, బర్హిస్సు, తదితరసంభారములు వీట్లయొక్క ఛేదదాహాదికమునందు ‘త్వన్నో అగ్నే’ ‘సత్వన్నః’ ‘త్వమగ్నే’ ‘ప్రజాపతే’ అను నీనాల్గుమంత్రములచే హోమముజేసి, అట్టిసంభారమును మరియొకదానినిగ్రహించి తిరిగి ‘అగ్నయేక్షామవతే’ ‘ఇంద్రంవోవిశ్వతః’ అను రెండుఋక్కులచే హోమములజేసి, పరిస్తరణలువైచి ఇంద్రునికొరకుహోమముజేయవలయు.

## ఇధ్మపరిధిదాహమునందు విశేషము.

ఇధ్మముగాని పరధులుగాని దహనమైనచో మరియొకదానిచే పరిధినివైచి ‘పరిత్వాగ్నే పురంవయం’ అనునాహుతి నగ్నికొరకు హోమముజేయదగు శేషముసమము.

## స్కన్నాదిప్రాయశ్చిత్తము.

ఆజ్యాదిహవిస్సు క్రిందికిస్రవించుట ఛేదనము, క్షామము, విపరీతభేదము కాదగిన పరిమాణమునకు హెచ్చుతగ్గుఅగుట వమనము గాత్రఛేదము పవిత్రనాశనము వీటియందు "యన్మఆత్మనోమిందాభూత్" 'పునరగ్నిశ్చక్షుః' అనునాహుతుల మిందాదిదేవతులకొఱకు హోమముచేయదగు.

## హవిస్సునందుదోమలు మొదలగునవిపడినచో ప్రాయశ్చిత్తము.

ఈగలు, దోమలు, రోమములు, చీమలు వీట్లచే హవిస్సుదుష్టమైనచో దానినివదలి ప్రాజాపత్యహోమము జేయవలయు పదముగాని వృత్తము గాని అక్షరముగాని స్వరముగాని భ్రష్టమైనచో 'అభిగీర్భిః' అనుమంత్రముచే హోమముజేయదగును పాత్రలయొక్క ఆసాదనము, ప్రోక్షణము, ఆదానము, మొదలగువాటియొక్క విపర్యాసమునందున్నా నాశమునందును సోమునికొఱకు ఒకఆహుతి నివ్వదగు ద్రవ్యము, కర్మము, హవిస్సు, మంత్రము వీట్లయొక్క విపర్యాసమునందు "మనోజ్యోతిః" "అయాశ్చాగ్నే" ఈరెంటి చేతను హోమముజేయవలయు.

## అగ్న్యుపఘాత ప్రాయశ్చిత్తము.

వా॥ గృహ్యప్రాయశ్చిత్తము అగ్న్యుపఘాతములన్నిటియందు "పునస్త్వా" అను మంత్రముచేత పూర్ణాహుతిచేసి సమిధనుంచవలయు ఈప్రాయశ్చిత్తహోమములు జేయు సమయమందు పత్నిసమీపమందుండవలయును, ప్రాయశ్చిత్తహోమాంతమునందు వ్యాహృతులచే నొకహోమముజేయదగును.

## నారాయణభట్టీయమునందువిశేషము.

ఇరువదియారంగుళముల పరిమాణమునకు శమ్యయనిపేరు అంతప్రమాణముగల ప్రదేశమునతిక్రమించిన అగ్నిని ప్రాయశ్చిత్తమంత్రముచే నభిమంత్రించి ప్రకృతకర్మ సమాప్తియగువఱకు అచ్చటనేయుంచదగినది అటుపిమ్మట "ఇదంతఏకం పరఊతఏకం" అనుమంత్రముచే ఆయతనమునందుంచదగినది పిమ్మట వ్యాహృతులచే నాజ్యాహుతులు వ్రేల్చదగు.

## శమ్య ఇరువదియారంగుళములప్రమాణమని ఆపస్తంబ మహర్షిపలికెను

శమ్యపరిమిది దేశమునగ్నిచేయతిక్రమించినచో పథికృదగ్నికొఱకు చరువునిర్వపణ

జేయదగు అందుశక్తిలేనిచో ద్వాదశస్రుహీతమగు ఆజ్యముచే స్రుక్కునుపూరించి అగ్నయె పథిక్రుతెస్వాహా అని పూర్ణాహుతినిగాని స్రువాహుతినిగాని వేల్చదగు.

## స్విష్టకృద్ధోమమునుచేయనిచో ప్రాయశ్చిత్తము.

ప్రమాదమున స్విష్టకృద్ధోమమునుచేయక ఉత్తరపరిషేచనముజేసినచో అప్పుడు వ్యాహృతులచే జెప్పబడిన హోమములుజేయదగు ప్రాయశ్చిత్తహోమాంతమునందు వ్యాహృతులనొక యాజ్యాహుతి వేల్చి పరిషేచనముజేయదగు.

## శకునప్రాయశ్చిత్తము.

గోవు, గుఱ్ఱము, దున్న, కుక్క, లేడి, అడవిపంది ఇవి అపసవ్యమునడచినచో ప్రాదప్రక్షాళనముజేసికొని "తద్విష్ణోఃపరమం" అనుమంత్రమును జపింపవలయు నక్క గాని వానరముగాని దీర్ఘముగాకూసినచో "దీర్ఘముఖీదృహిణుమాస్మ" అను మంత్రమునుజపింపవలయు గుడ్లగూబమొదలగువాట్లయొక్క భయంకరమగుశబ్దము వినవచ్చినచో "త్వమగ్నేరుద్రః" "ఆవోరాజానం" అనుమంత్రములచే రెండుహోమములుజేయదగు లేక జపింపదగు హోమముజేసినపక్షమున "రుద్రాయేదమని" త్యాగము ఇట్లుచేసి "ద్విపచ్చతుష్పదస్మాకగ్ం" అనుమూడువాక్యములచే నాశకునవాక్కు నభిమంత్రింపనగు.

## అగ్నినాశప్రాయశ్చిత్తము.

లేఖనముకంటెపూర్వము అగ్నినష్టమగుచో తిరిగి యగ్నినిప్రతిష్ఠించి "పునస్త్వా" అనుమంత్రముచే సమింధనముజేయవలయు.

## అగ్నితనంతటప్రజ్వరిల్లుచో ప్రాయశ్చిత్తము.

అగ్నితనంతటనే ప్రజ్వరిల్లుచో "ఉద్దీప్యస్వ" "మానోహిగ్ంసీత్" అనుమంత్రములచే రెండుసమిద్ధోమములుజేసి హోమకర్మ ప్రారంభింపనగు.

## ఆఘారప్రక్షేపణమునకు పూర్వమగ్నినష్టమైనచో ప్రాయశ్చిత్తము.

ఆఘారములకంటె పూర్వము అగ్నినష్టమగుచో తిరిగియథావిధిగా అగ్నినిప్రతిష్ఠించి సమస్తవ్యాహృతిహోమము మిందాహుతి అనాజ్ఞాతత్రయహోమము చేయదగు.

## ఆఘారహోమానంతర మగ్నినష్టమగుచో.

ఆఘారహోమానంతరము వేదికమధ్యయందగ్ని నష్టమైనదనితోచినచో పంచహోత్రచేతను మహావ్యాహృతులచేతను హోమముజేయదగును.

### ఇధ్మప్రక్షేపణమునకు పూర్వముఅగ్నినష్టమైనచో.

తిరిగి అగ్నినిప్రతిష్ఠించి "పునస్త్వా" అనుమంత్రముచే ప్రజ్వరిల్లజేయదగు.

### వివాహౌపాసనకంటె పూర్వమగ్నిశాంతించినచో.

యుగము (కాడి) లాజలు వీటికి సంబంధించినకర్మకుతోబడిన కలాపమును తిరిగి చేసి శేషముపూరింపనగు.

### వివాహమైననాల్గురోజులమధ్యను అగ్నియనుగమించినచో.

ఉపనయనాగ్ని, వివాహాగ్ని, శవాగ్ని, సూతకాగ్ని ఇవిశాంతించుటగాని హరింపబడుటగాని ఉపఘాతమునొందుటగాని సంభవించినచో (అనగా ఆయాకర్మలయొక్క సమాప్తికంటె పూర్వమునష్టములగుట రజస్వలాదులచే స్పృశింపబడుట) ఇట్టివి సంభవించినచో ప్రాణాయామముజేసి సంకల్పించి 'శంనోదేవీ' అనుమంత్రముచే నుదకమునుభస్మమునందు ప్రోక్షించి 'అయన్తె యోనిర్ ఋత్వియ' అనుమంత్రముచే సమిధనాభస్మయందుంచి యథావిధిగా అగ్నినిప్రతిష్ఠించి "ఆజుహ్వానస్సుప్రతీకః" "ఉద్బుధ్యస్వాగ్నే" అనుమంత్రద్వయముచే ఆసమిధనగ్నియందుంచి తత్ప్రాయశ్చిత్తార్థమై గోవునుగాని తన్మూల్యమునుగాని దానముచేయుదగు పిమ్మట అగ్నికిపరిస్తరణలువైచి ఆజ్యసంస్కారమువరకు జేసి "అయాశ్చాగ్నే" "అగ్నిహోతా" అనుపంచహోతయు 'బ్రాహ్మణఏకహోతా' "మనోజ్యోతిః" "యన్మఆత్మనో" "పునరగ్నిశ్చక్షుః" అనుహోమములున్నూ మహావ్యాహృతులున్నూ అనాజ్ఞాతత్రయము వ్యస్తములగువ్యాహృతులు "ఇమంమేవరుణ" "తత్వాయామి" "త్వంనోఅగ్నే" "సత్వన్నోఅగ్నే" "తన్తుంతన్వన్రజ" అనియు హోమముజేసి శేషించిన తంత్రమునుజరుపదగు. ఉపనయనాగ్నియనగా పాలాశహోమమువరకు శేషహోమాంతము వివాహాగ్ని సంచయనాంతము శవాగ్ని జాతకర్మజేయబడినఅగ్ని పదిరోజులవరకు సూతకాగ్నియనబడు.

### స్థాలీపాకముకంటెపూర్వముఅగ్నినష్టమైనచో.

ఇతరహోమములుకొన్ని విధింపబడియున్నవి అనగా యుగలాజాంతరకర్మలు స్థాలీపాకముకంటెను పరమందైనచో "అయాశ్చాగ్నే" అనుహోమముజేయదగు పూర్వమైనచో పునరాధానముచేయవలయునని తాత్పర్యము.

### శ్రాద్ధమధ్యయందగ్ని నష్టమైనచో.

లౌకికాగ్నినితెచ్చి సప్తవ్యాహృతులచే హోమముచేసి పూర్ణాహుతిజేయదగు.

## అగ్న్యారోపణముజేయబడిన సమిధనశించినచో.

గానిబౌపాసనాగ్నియుండగా సీమాతిక్రమణముజేసినచోగాని "అయాశ్చ" అను మంత్రముచే హోమముజేయుదగు. ఒకనిచే అగ్న్యారోపణచేయబడిన సమిధయందు మరియొకడగ్న్యారోపణముజేసినచో నపుడును అగ్నిసంసర్గప్రాయశ్చిత్తముజేయదగు హోమముజేసి సమిధయందుగాని ఆత్మయందుగాని ఆరోపింపఁబడినయగ్ని రజకాదిగ్రామచండాలురు చండాలురు శూద్రులు కుక్క మొదలగునవి స్పృశించుట మూత్రపురీషస్పర్శనము మొదలగువానిచే శాంతించనిచో నపుడు పునస్సంధానముజేయనగు.

## అన్వాధానమైనతరువాత ఇష్టియగులోగా అగ్నియనుగమించుచో.

అయాశ్చ అనుమంత్రముచే చెప్పబోయెడిరీతిని పునస్సంధానముజేసి సంకల్పపూర్వకముగా సంస్కరింపబడిన యాజ్యముచే "ఓంభూర్భువస్సువస్స్వాహా" అని ప్రాయశ్చిత్తహోమమునుజేసి తిరిగి అన్వాధానముజేసి, ఇష్టియొనర్పదగు

## వైదికాగ్నిద్వయ ప్రాయశ్చిత్తము.

యజ్ఞదత్తునిచే హోమముజేయబడిన యజ్ఞదత్తుని ఔపాసనాగ్నియందు దేవదత్తుడు తనయగ్నినివిహరించి హోమముజేసినచో యజ్ఞదత్తుడున్నూ దేవదత్తుడున్నూ చెరియొకసమిధను ఆయగ్నియందు "అయన్తేయోనిః" అనుమంత్రముచే తపింపజేసి తిరిగి వేరు వేరుగా లౌకికాగ్నులను ప్రతిష్ఠించి తమతమసమిధలను తమతమచే ప్రతిష్ఠింపబడిన యగ్నులయందు "ఆజుహ్వానః" అనుమంత్రముచే వ్రేల్చదగు పిమ్మట యజ్ఞదత్తుడు అగ్నిని ప్రజ్వరిల్లజేసి అలంకరించి పరిస్తరణలువైచి చరువునువండి పాత్రాసాదనాద్యగ్నిముఖాంతమున 'అయాశ్చ' అనియు, వ్యాహృతులచేతను రెండుహోమములుజేసి స్రువమునందొకసారి యుపస్తరణముజేసి రెండుపర్యాయములు అవదానముజేసి యొకపర్యాయమభిఘారముజేసి "అగ్నయేవివిచయేస్వాహా" అగ్నయే స్విష్టకృతేస్వాహా అనుయాహుతులవేల్చి శేషముపూరింపనగు ఇదివివిచేష్టియనఁబడు విహారకర్తఅనఁగా(ఇతరుని యౌపాసనాగ్నియందుతనయగ్నినారోపించివిహరించినమూఢుడుఅగు) దేవదత్తుడుతనచేతపింపజేయబడిన సమిధనుతిరిగిప్రతిష్ఠింపబడినఅగ్నియందు ఆజుహ్వానః "ఉద్బుధ్యస్వాగ్నే" అనురెండుమంత్రములచే వ్రేల్చిపరిస్తరణముచరుశ్రపణముపాత్రాసాదనముజేసిఅగ్నిముఖాంతమునందు"అయాశ్చ"అనియువ్యాహృతులచేతను రెండు హోమములుచేసి పిమ్మట వెనుకటివలె అవదానముచేసి ఆచరువునందు అభిఘారణజేసి అగ్నయెపధికృతేస్వాహా అగ్నయెస్విష్టికృతేస్వాహా అను రెండుహోమ

ములుజేసి తంత్రశేషమును పూరించవలెను ఇది పథికృద్ధ్యేష్టియనంబడు విహారకిది శేషము ఇదియొనర్చినపిమ్మట సంసర్గనిమిత్తకమైన వివిచేష్టిని వెనుకటివలెనాచరింపవలెను.

## వైదికలౌకికాగ్ని సంసర్గప్రాయశ్చిత్తము.

వైదికాగ్నికి లౌకికాగ్నితో సంసర్గకలిగినచో స్థాలీపాకపూర్వకముగా వివిచేష్టి జేసి 'పునస్త్వా' ఉపఘాతహోమము జేయవలెను అరణి ఆత్మ సమిధ వీటియందారోపింపబడిన యగ్నికిట్టి సంసర్గకలిగినను ఈప్రాయశ్చిత్తము జేయవలెను ఈప్రాయశ్చిత్తమునందు పూర్ణపాత్రము ఇధ్మము బర్హిస్సు చరువు ఇవిలేకయే అగ్నిప్రతిష్ఠాపన పూర్వకముగా ఆజ్యసంస్కారముచేసి నాల్గుపర్యాయములుగ్రహించి మనోజ్యోతిః వ్రేల్చవలెను.

## ఔపాసనాగ్ని వైతానికాగ్ని సంసర్గప్రాయశ్చిత్తము.

ఔపాసనాగ్ని యౌపాసనాగ్నితోను శ్రౌతాగ్ని శ్రౌతాగ్నితోను కలసినచో "అయన్తేయోనిః" అనుమంత్రముచే నాయగ్నియందొక సమిధను తపింపచేసి వేరుఅగ్నిని ప్రతిష్ఠించి "అగ్నిసంసర్గప్రాయశ్చిత్తంకరిష్యే" అనిసంకల్పించి సమిధ నగ్నియందు "ఆజుహ్వాన" యనుమంత్రముచేవ్రేల్చి 'అయాశ్చ' యనుమంత్రముచే హోమముచేసి వివిచేష్టిచేయవలెను లౌకికాగ్నిసంసర్గమైనచో "పునస్త్వా" అనుమంత్రముచే సమిధనగ్నియందుంచి అయాశ్చ యనుమంత్రముచే హోమముజేయవలెను.

## ఔపాసనాగ్నియందు బ్రహ్మచారి యగ్నిసంసర్గమైనచో.

కామావకీర్ణ మంత్రములచే ఆజ్యహోమములుజేయవలెను ఔపాసనాగ్నియందు వటువగ్నికార్యముజేసినను వటుడగ్నికార్యముజేసిన యగ్నియందు గృహస్థుడౌపాసముజేసినను "పాహినోఅగ్నే" అనునది మొదలుగాగల మంత్రములచే నైదుహోమములును "మనోజ్యోతిః" అనియు "సప్తతేఅగ్నే" అనియు అనాజ్ఞాతత్రయముచేతను హోమముజేయవలెను.

## ద్విభార్యాగ్నిసంసర్గము.

గృహస్థునకు అనురాగమువలన పెండ్లియాడబడిన భార్యలిరువురుండినచో నొకయగ్నియందొకపర్యాయము హోమముజేయుటచే రెండగ్నులయందుజేసిన ఫలమునుపొందుటకు క్రమముగా నారెండుఅగ్నులకు సంసర్గముచెప్పబడియె రెండవభార్య ఆవ్వార్బ్ధయైయుండ తత్సంబంధమగుయగ్నిని ప్రజ్వరిల్లజేసి "సమస్తబ్రువయె" అను మొదలు బ్రహ్మంతవేదమ్మం అనుమంత్రముచే నాల్గుపర్యాయములు గ్రహింపబడిన యాజ్యమునుహోమముజేసి ఆయగ్నిని "అయన్తేయోనిః" అనుమంత్రముచే సమిధయందారోపించి జ్యేష్ఠభార్యగాపే

అన్వారబ్ధయైయుండ తత్సంబంధమగుయగ్నిని ప్రజ్వరిల్లజేసి ఆయగ్నియందు ఈసమిధను ఆజుహోన్వః ఉద్బుధ్యస్వ అనుమంత్రములచేనుంచి ఆజ్యసంస్కారాంతమున చతుర్గృహీతాజ్యముచే యోబ్రహ్మ అనునదిమొదలగు ంమంత్రములచే హోమముజేసి సమితగ్ంసంకల్పేథాం అనుపురోనువాక్యనుచ్చరించి పిమ్మట అగ్నే పురీష్యాధిభవాత్వన్నః అనునదిమొదలగు ఆయనువాకమునందలి శేషించినబుక్కులచే హోమములజేయవలయు.

## మరియొకపక్షము.

మొదటియగ్నిని రెండవయగ్నిని క్రమముగాదక్షిణమున ఉత్తరముననుంచిరెండగ్నులయందును ప్రాతరౌపాసనముజేసి పత్నులతోగూడి ప్రాణాయామముజేసి ఏపంగు...ప్రీత్యర్థం పత్నీభ్యాం సహితస్సన్ గృహ్యాగ్ని సాధ్యానాం కర్మణాం తంత్రానుష్ఠానఫలసిద్ధ్యర్థం ఔపాసనాగ్ని ద్వయసంసర్గంకరిష్యే అని సకల్పించి రెండగ్నులమధ్యను స్థండిలోల్లేఖనాదికముజేసి భవతన్నస్సమనసౌ అద్యనః అగ్నావగ్నిశ్చరతి...భాగధేయం అనుమంత్రములచే అప్రత్యక్షములగు యౌపాసనాగ్నులను మధ్యయందు రచింపబడిన స్థండిలమునందొకపర్యాయము భార్యలచేస్థాపింపజేసి చరుశ్రపణముజేసి అగ్నిముఖాంతమున అగ్నయే తంతుమతేస్వాహా అనునది మొదలగు తంతుమతీస్థాలీపాకము జయాదికముజేయవగు.

## స్మార్తాన్వాధానేష్టుల మధ్యయందలి ప్రాయశ్చిత్తము.

సమిధయందుగాని ఆత్మయందుగాని అగ్నినారోపించి అన్వాధానముచేయక మరచినచో లౌకికాగ్నిని ప్రతిష్ఠించి అలంకరించి 'పునస్త్వా' అనుమంత్రముచే సమిధనుంచి "శ్రద్ధాంమేధాం" అనుమంత్రమునుచ్చరించి నమస్కరించి యన్వాధానముజేయనగు. భుజించినతరువాత జ్ఞాపకమువచ్చినచో సాయమౌపాసనహోమముజేసి "అనాజ్ఞాత" త్రయముచే హోమముజేసిగాని లేక జపించిగాని వెనుకటివలె సమిధనుంచవలయు సాయంకాలమన్వాధానముజేయుపక్షమున అనాజ్ఞాతత్రయము త్వన్నః సత్వన్నః అనుమంత్రములచే నైదాహుతులను భూరాదివ్యాహృతులచే నాల్గుఆహుతులను వేల్చి అన్వాధానముజేసి మరునాడు స్థాలీపాకముజేయనగు.

## అన్వాధానేష్టిమధ్యయందుగ్రహణముసంభవించినచో.

సూర్యగ్రహణమైనచో 'ఉదుత్యంజాతవేదసం' ఉద్వయంతమసస్పరి 'చిత్రందేవానాం' అనుమంత్రములచే మూడాజ్యాహుతులవేల్చియు చంద్రగ్రహణమైనచో నవోనవోభవతి యమాదిత్యా అనుమంత్రములచే రెండాజ్యాహుతులను వేల్చి ఇష్టియొనర్పదగు.

## బృహన్నారదీయమునందు.

అన్వాధానేష్టులమధ్యను సూర్యగ్రహణమువచ్చినచో "ఉదుత్యంజాతవేదసం" 'ఆసత్యేన' 'ఉద్వయం' అనుమంత్రములచేతను చంద్రగ్రహణమైనచో "అప్సువేసోమః" 'ఆప్యాయస్వ' 'సోమయాస్తే' అనుఋక్కులచేతను ఆజ్యహోమములు జేయవలయు.

## గ్రంధాంతరమందు దీనికిప్రయోగము.

అన్వాధానేష్టులమధ్య చంద్రగ్రహణమైనచో ఇష్టిదినమునందే హవిరాసాద నాంతముజేసి అన్వాధానేష్టిమధ్యే చంద్రగ్రహణ దోషప్రాయశ్చిత్తార్థ మాజ్యహోమం కరిష్యే అనిసంకల్పించి 'నవోనవోభవతి' ఆయుస్వాహా సోమాయేదం యమాదిత్యాఅ గంశుం... గోపాయస్వాహా సోమాయేదం అని ప్రోక్షితాజ్యముచే రెండుహోమములు జేసి తంత్రశేషము సమాప్తినొందింపనగు సూర్యగ్రహణమైనచో ఉదుత్యంజాతవేదసం ఉద్వయంతమసస్పరి చిత్రందేవానాం అనుమంత్రములచే మూడుహోమములుజేసి తంత్ర శేషముజేయునగు.

## అన్వాధానేష్టులమధ్య ప్రయాణమైనచో.

సంకల్పపూర్వకముగా సంస్కరింపబడిన యాజ్యముచే "తుభ్యంతాఅఙ్గిరస్త్వ" అను మంత్రముచే హోమముజేసి అరణ్యాదులయందు ఆరోపించి హోమకాలమునందు అగ్నిని తిరిగిప్రతిష్ఠించి ప్రతిపద్ధోమపూర్వకముగా ఇష్టినాచరింపనగు ప్రతిపత్తున ప్రమాదమున ఇష్టినాచరింపనిచో తదియమొదలుగాగల తిథులయందు ఔపాసనమైనతరువాత సంకల్ప పూర్వముగా సంస్కరింపబడిన ఆజ్యమును వ్యస్తములైనట్టియు సమస్తలైనట్టియు వ్యాహృ తులచే హోమముజేసి తిరిగియన్వాధానము యాగముచేయనగు.

## అన్వాధానేష్టుల మధ్యకాలమునందు పత్నిరజస్వలసంభవించుట.

ఆపత్నిని ఆవరణలోపలనుంచి ప్రతిపత్తుననే ఇష్టిచేయదగు అన్వాధానమునకు పూర్వము రజస్వలయైనచో ఐదవదినమునందు సద్యస్కాలాన్వాధానపూర్వకముగా ఇష్టి యొనర్పదగు.

## అనాదిష్ట ప్రాయశ్చిత్తము.

ప్రాయశ్చిత్తహోమములు నిర్ధారణజేయబడనితావున "ఇమంమ్మే" అనునిదిమొ దలగు వారుణమంత్రములచే హోమముజేయదగు దేవతనిర్ధారణజేయబడనితావున అగ్నయ ఇదం అని త్యాగముజెప్పదగు.

## విధురాగ్ని సంధానము.

ప్రణవముచె అగ్నినెత్తి 'అన్వగ్నిరుషసామ్' అతతాః అను మంత్రముచే పురోభాగమునకుదెచ్చి "పృష్ఠోదివిపృష్ఠోఅగ్నిః పాతునక్తః అను మంత్రములచే అచ్చటనుంచి పిమ్మట నాల్గుశమీకాష్ఠములచే హోమముజేయనగు అందురేఖలు మొదలగునవిలేవు "తత్సవితుర్వృణీమహే" అని యొకశకలమును (అనగా శమీకాష్ఠమును) స్వాహాకారశూన్యముగా నగ్నియందుంచవగు "తాగ్ంసవితుర్వరేణ్యస్యచిత్రామ్...మహింగాం" అని రెండవశకలమును "విశ్వానినోదుర్గహా...కనూనాం" అని మూడవశకలమును "అద్యానోదేవసవితః...తన్మఆసువః" అని నాల్గవశకలమునుఉంచి పిమ్మట నిత్యోపాసనాదికర్మలను చేయవగు ఇది విధురాగ్ని యుత్పన్నమయ్యెడిరీతి.

## మఱియొక్క విశేషము.

ఈవిధురాగ్నికి ఆరోపణము అవరోపణము లేవు అనికొందరు విద్వాంసులయభిప్రాయము కొందరువిద్వాంసులమతముననుసరించి ఈయారోపణావరోపణములు కలవు తిరిగి వివాహమాడుట లేక సన్యసించుట చనిపోవుట వీనిలోనొకటియగువరకు విధురుడును గృహస్థునివలె ఇట్టియగ్నియందు యజ్ఞాదికమునుచేయవగు ఇదివిధురులయాచారము యజమానుడు గ్రామాంతరగతుడైయుండ పత్ని తనచే కాపాడబడుచున్న యగ్నిని ఊరిపొలిమేరను దాటించినచో పునరాధానముచేయుటయే ప్రాయశ్చిత్తమని యాపస్తంబునియభిప్రాయము అట్లుచేసినచో దోషములేదని సంగ్రహకారుడు, పత్నిపొలిమేరనతిక్రమించియుండగా సూర్యుడుదయించినచో లేక అస్తమించినచో తిరిగి యాధానముచేయుటయే ప్రాయశ్చిత్తమని యాపస్తంబుడు అగ్నిప్రజ్వల్లుచుండగా నట్టిదోషముపతించదని సంగ్రహకారుడు, అగ్నినిప్రత్యక్షముగా అనగా అరణి మొదలగువాటియందు ఆరోపింపక బహిర్భాగములకు తీసుకపోయినచో పునరాధానముచేయదగునని యాపస్తంబుడు, అట్లారోపణచేయకయే అగ్నినితీసుకవెళ్ళుతరి అగ్నికభిముఖముగా నిట్టూర్పువిడచినచో పునరాధానముచేయదగునని సంగ్రహకారుడు, ప్రజ్వరిల్లుచున్న అగ్నిని మరియొకప్రదేశమునకు చేర్చవలసివచ్చినచో నిట్టూర్పువిడువకయే తీసుకపోవలయు అట్లువిడువవలసివచ్చినచో ఆయగ్నినిభూమియందుంచి స్వేచ్ఛగా గాలిపీల్చుకుని తిరిగియగ్నినిగ్రహించిపోదగు ఇట్లు రెండవపర్యాయముగూడ నిట్టూర్పువిడువదగు మూడవపర్యాయముగూడ అగ్నినిక్రిందనుంచి నిట్టూర్పువిడచినచో పురాధానముచేయనగునని సంగ్రహకారుడు అట్లునిట్టూర్పువిడచుటకై క్రిందనుంచబడినయగ్నిశమించినను ఆపహరింపబడినను.

## ప్రమాదమువలన అగ్నినిపరిత్యజించినచో ప్రాయశ్చిత్తము.

స్కాందపురాణమునందు "రాజా" యే బ్రాహ్మణుఁడు ప్రమాదమువలన అగ్నిని పరిత్యజించునో అతఁడు మూడురాత్రులలోగానైనచో నూఱుప్రాణాయామములుచేయదగు పిమ్మట ముప్పదిరెండురాత్రులపర్యంత ముపవాసముచేయఁదగు.

## కూర్మపురాణమునందు.

రెండుమాసములు ప్రమాదమువలన అగ్నిత్యజించినచో మూడురాత్రులుపవసింపదగు పిమ్మట సంవత్సరపర్యంతము ప్రాజాపత్యకృచ్ఛ్ర వ్రతమునాచరింపదగు, ప్రమాదము వలన అగ్నినిత్యజించినచో మూడురాత్రిలలోగా "అయాశ్చాగ్నే సి" అనియు ఏమూడు రాత్రులవరకు "మనోజ్యోతిః" అనియు పదిరాత్రులవరకు మూడుతంతుమతీహోమములు గాని నూరుప్రాణాయామములుగాని పిమ్మట ఇరువదిరాత్రులవరకు ఉపవాసమున్నా మాసమువరకు ప్రాణాయామశతము ఉపవాసమున్నా పిమ్మటరెండుమాసములవరకు మూడు రాత్రిలుపవాసము ప్రాజాపత్య కృచ్ఛ్రవ్రతములో సగమును ఆచరింపదగు అటుపైని సంవత్సరమువరకు పూర్ణమగు ప్రాజాపత్యకృచ్ఛ్రవ్రతమును పిమ్మట శక్త్యనుసారముగా సంవత్సరమునకొకటింటికొక కృచ్ఛ్రమువంతున నాచరింపదగు శక్తియుండియు ఎవఁడగ్ను లను నాస్తికుడై త్యజించునో వాడు రెండుమాసములకు కృచ్ఛ్రము నాల్గుమాసములకు కృచ్ఛ్రద్వయము ఆరుమాసములకు కృచ్ఛ్రత్రయము పిమ్మట సంవత్సరమువరకు ఐదుకృచ్ఛ్ర ములు పిమ్మట ప్రతిసంవత్సరమునకు ఐదైదు కృచ్ఛ్రములవంతున నాచరింపఁదగు.

## మాంద్యమువలన అగ్నినివదలినచో ప్రాయశ్చిత్తము.

మాంద్యమువలన పండ్రెండురాత్రిలగ్నిని వదలినచో మూడురాత్రిలుపవాసము గాని సగముకృచ్ఛ్రముగాని ప్రాయశ్చిత్తము. మాసమతిక్రమించినచో పండ్రెండుదినము లుపవాసముగాని రెండుకృచ్ఛ్రములుగాని ప్రాయశ్చిత్తము సంవత్సరమతిక్రమించినచో మాసముపవాసము పయోభక్షణముగాని కూశ్మాండహోమముగాని ఐదుకృచ్ఛ్రములుగాని రెండునుగాని చేయదగు, సంవత్సరమతిక్రమించిన యారుమాసములవరకు ఎనిమిది కృచ్ఛ్ర ములు, పిమ్మటనారుమాసములవరకు పదునొకండుకృచ్ఛ్రములు జేయఁదగు ఇట్లుకాలము ననుసరించి ప్రాయశ్చిత్తము వృద్ధినొందుచుండు అట్టిప్రాయశ్చిత్తమాచరింపక పునరాధా నముజేయఁదగదు. ఇట్లు హోమముజేయనిమాసమొకటికి రెండుప్రస్థముల ప్రమాణముగల తండులములవంతున హోమద్రవ్యదానముజేయనగు ఈప్రాయశ్చిత్తము, ప్రమాదమువలన గాని మాంద్యమువలనగాని పదిరాత్రులతిక్రమించినచో జేయుదగు, అదియె పునరాధాన

మనఁబడు. సీమాతిక్రమణముచే అగ్ని లౌకికమైనను సమిధాదులయందారోపింపబడినయగ్ని నిట్టూర్పు విడచుటకై యూడవపర్యాయము మార్గమధ్యమున దింపబడినను ఔపాసనమును పర్వమున్నా అతిక్రమించినను సూతకముచే అంతరితమైనను "మనోజ్యోతి" అను హోమ ముజేసి పునస్సంధానము జేయఁదగు

## పునస్సంధానాంగ హోమద్రవ్యపరిమాణము.

మాసమువరకు హోమముజేయనిచో గుణవంతుడగు బ్రాహ్మణునకు ఐదుప్రస్థ ముల తండులములుగాని యవలుగాని దానముజేయవగు ప్రతిమాసమునకు ఈరీతిని హోమ ద్రవ్యదానము పెంపగుచుండు అబుద్ధిపూర్వకముగా సంవత్సరమువరకు అగ్నిని త్యజించి నచో కృచ్ఛ్రత్రిరాత్రముజేయవగు ఇదియేబుద్ధిపూర్వకముగానైనచో ప్రాయశ్చిత్తము ద్విగు ణము ఈరీతిని సంవత్సరములసంఖ్యననుసరించి చేయనగు పరిశుద్ధతకొఱకు సంవత్సరమొకటి కొక కృచ్ఛ్రమైనను ఆచరింపఁదగు.

## గ్రంథాంతరమునందు.

ఎంతకాలము హోమముజేయడో అంతకాలమునను సరించి హోమద్రవ్యదానము బ్రాహ్మణులకొఱకు జేయనగు, సంవత్సరమొకటి కరువదిప్రస్థముల తండులములను రెండు ప్రస్థముల ఘృతమును మహర్షులచే నిర్ణయింపఁబడినది.

## పునస్సంధానము.

రోహిణి, రేవతి, విశాఖ, పుష్య, జ్యేష్ఠ, మృగశీర్ష, కృత్తిక, ఉత్తరాత్రి యము, చిత్ర, పునర్వసు, ఈనక్షత్రములయందు అగ్న్యాధానముజేయవగు, రాత్రియందగ్ని యుత్పన్నమగుగాన సాయంకాలమె యగ్నిసంధానము జేయందగు ప్రాతఃకాలము అగ్ని సంధానముజేయవగదు వివాహమువలన పుట్టినయగ్నిని రాత్రియందు తానుహోమముజే యనగు రాత్రికాలమతిక్రమించినచో మరునటిదినమున సాయంకాలముపక్రమింపవగు స్థాలీ పాకానంతరము నిత్యహోమమును ఉపక్రమింపవలయునని మహర్షులచే జెప్పఁబడియె.

## మఱియొకవిశేషము.

పలురకములగు కృచ్ఛ్రములచే శరీరమునుశోధించి హోమద్రవ్యదానముజేసి ప్రాణా యామముజేసి, భార్యతోగూడి సంకల్పింపవలయు సాంగవేదాధ్యయనము జేసినవానియింటి నుండి యగ్నిని గ్రహింపవలయు అనఁగా ఆపస్తంబసూత్రమునందు చెప్పబడినరీతిని తాను అగ్నిని విడచినకాలమునకనుగుణమగు కృచ్ఛ్రాదికప్రాయశ్చిత్తమును ఆచరించి మంగళ

స్నానముజేసి ప్రాణాయామముజేసి "విచ్ఛిన్నస్యౌపాసనాగ్నేః పునస్సంధానంకరిష్యే" యని సంకల్పించి ఆకాలమునకును గుణమగుహోమద్రవ్యదానము బ్రాహ్మణునకు జేయదగు. ఆవిధము ప్రాణాయామముజేసి "ఏతావంతంకాలమౌపాసనాగ్నివిచ్ఛేదజనిత ప్రత్యవాయపరిహారార్థం విచ్ఛేదకాలగణనయా స్మృత్యుక్తప్రాయశ్చిత్తంకరిష్యే" (ఇంత కాలమౌపాసనాగ్ని విచ్ఛిత్తివలన గలిగెడి ప్రత్యవాయముయొక్క నివృత్తికొరకు విచ్ఛిత్తి గల్గినకాలముయొక్క పరిమాణమనుసరించి స్మృతియందుచెప్పబడిన ప్రాయశ్చిత్తమును జేయుదును) అనిసంకల్పించిచేయవలయు దీనిని దంపతులిరువురు కలసిచేయవలయు ఇట్లు కాలానుగుణముగాజేసి "మమఔపాసనస్య విచ్ఛిన్నదర్శపూర్ణమాస స్థాలీపాకనాంచ తద్గణనయావ్రీహ్యాజ్యద్రవ్యం యథానామగోత్రేభ్యో బ్రాహ్మణేభ్యో యుష్మభ్యంసంప్రదదే" అని మంత్రముచే ఆద్రవ్యము బ్రాహ్మణులకియ్యవలయు, పిమ్మట శ్రోత్రియుని గృహమునుండి తేబడినయగ్ని నాయతనమునందు యథావిధిగా ప్రతిష్ఠించి ఉపావరోహణముజేసి అగ్నినలంకరించి స్రుక్కు, ఆజ్యస్థాలీ, ప్రోక్షణీ, స్రువములను, ఆసాదించి ఆజ్యసంస్కారాంతమునందాకపర్యాయము గ్రహింపబడిన యాజ్యముచే "అయాశ్చ" అను మంత్రముచేతను, వ్యాహృతులచేతను రెండుహోమములుజేసి పిమ్మట నాల్గుపర్యాయములు గ్రహింపబడిన యాజ్యముచే "మహావిహోతా...మనఃపృథివ్యైస్వాహా" అనియు తిరిగి అట్టియాజ్యముచేతనే "యదస్మిన్యజ్ఞేంతరగామి...ఘృతేనస్వాహా దేవేభ్యఇదం "త్రయస్త్రింశత్తంతవః...అప్యేతుస్వాహా అగ్నయేతంతుమతఇదం" తంతుం తన్వన్రజసః దైవ్యంజనగ్గ్ స్వాహా అగ్నయఇదం" ఉద్బుధ్యస్వాగ్నే...త్వయితంతుమేతగ్గ్ స్వాహా అగ్నయేజాతవేదసఇదం" "ఉదుత్తమంవరుణపాశం...స్యామస్వాహా, వరుణాయేదం" ఉద్వయంతమసస్పరి...ఉత్తమగ్గ్ స్వాహా సూర్యాయేదం అగ్నే అభ్యావర్తిన్నభిన...జనేనచస్వాహా...అగ్నయే అభ్యావర్తినఇదం॥ అగ్నే అంగిరః ఆకృధిస్వాహా 'అగ్నయేఅంగిరసఇదం' 'పునరూర్జా...విశ్వతస్స్వాహా' అగ్నయఇదం॥ సహరయ్యా...విశ్వతస్పరిస్వాహా అగ్నయఇదం ఇట్లుహోమముజేసి పండ్రెండు పర్యాయములు గ్రహింపబడిన యాజ్యముచే స్రుక్కును పూరించి "సప్తతేఅగ్నే...ఘృతేనస్వాహా అగ్నయేసప్తవతఇదం" అని సప్తవతిచే పూర్ణాహుతిహోమముజేసి పిమ్మట యుత్తరపరిషేచనముజేసి యస్యస్మృత్యా అనునదిమొదలుగాగల హోమశేషమును పూరించి తిరిగి ప్రాణాయామముజేసి "తంతుమతీస్థాలీపాకేన సద్యోయక్ష్యే" అని సంకల్పించి "పత్న్యవహన్తి" అనునదిమొదలుగా ఆగ్నేయస్థాలీపాకమునందువలె చరువునువండి అభిఘరించి తూర్పుగాగాని

ధ్యుత్తరముగాగాని జరిపి మఱల యభిఘరించి అగ్నినిప్రజ్వరిల్లజేసి మట్పాత్రప్రయోగముతో ఆజ్యసంస్కారాంతమున, పత్నియన్వారబ్ధయైయుండ (తనను గాని తనవస్త్రమును గాని తాకియుండ) అగ్నయేస్వాహా అనిముఖాహుతివ్రేల్చి అవదానధర్మముచే చరువు నవదానముజేసి "అగ్నయేతన్తుమతేస్వాహా" అగ్నయేతన్తుమత ఇదం అనివ్రేల్చి స్విష్టకృద్ధోమముకొఱకు చరువునవదానముజేసి "అగ్నయేస్విష్టకృతేస్వాహా" "అగ్నయేస్విష్టకృత ఇదం" అనివ్రేల్చి జయాదిహోమములుజేయఁదగు ఇందుపయుధుతేగాని శమ్యులుగానేరవు పిమ్మట ప్రణీతామార్జనము బ్రహ్మోద్వాసముజేసి "అయన్తేయోనిః" "యాతేఅగ్నే" అను మంత్రములచే సమిదారోపణముగాని ఆత్మారోపణముగాని జేయఁదగు, బ్రహ్మకుగోవు నివ్వఁదగు.

## సమిదారోపణము ఆత్మారోపణములకువిధి.

ఆపద్విషయమునందు మఱియొకపక్షమును జెప్పుచున్నాడు, "ఆయన్తేయోనిః" రయిం అనుమంత్రముచే నొకసమిధ నగ్నియందు తపింపఁజేయదగు ఆసమిధను తిరిగిహోమకాలమునందు "ఆజుహ్వానః... సీదత ఉద్బుధ్యస్వాగ్నే...తన్తుమేతం" అనుమంత్రములచే లౌకికాగ్నియందుంచదగు ఇదిసమిదారోపణములేక "యాతేఅగ్నే...సక్షయఏహి" అనుమంత్రముచే కుడిచేతిని తపింపఁజేసి ఘ్రాణరంధ్రములచేగాని మఱియొకదానిచేగాని అగ్ని నాత్మయందుగాని స్థాపింపఁదగు తిరిగి హోమకాలమునందు "ఉపావరోహ... దురోణే" అనుమంత్రముచే నొకసమిధను లౌకికాగ్నియందుంచదగు హోమాదికము సకము ఎంతహవిస్సుహోమముజేయబడునో అంతగాయత్రీజపము జేయదగు.

## దూరమందున్న భార్యకలవానికి శ్రాద్ధమధ్యమున పునస్సంధానము.

భార్యదూరమందుండుటచే నష్టమగుయగ్నికలవాడు, పార్వణశ్రాద్ధముజేయవలసి వచ్చినచో పునస్సంధానముచేసి శ్రాద్ధమునాచరించి తిరిగియగ్నినుంచదగు.

## హోమకాలము.

ఛందోగపరిశిష్టమునందు, సూర్యుడుదయించినతరువాతను ఉదయింపకపూర్వమును సమయాధ్యుషితకాలమునందును (అనఁగా ప్రభాతసమయమున, నక్షత్రమండలమస్తమించినపిమ్మట సూర్యుడుదయించుటకుపూర్వమునను) హోమముజేయుదగునని వేదమునందు జెప్పఁబడెను, రాత్రియొక్క పదునారవభాగమునందు, గ్రహనక్షత్రాదులతోగూడిన

కాలమును గుర్తెరింగి హోమముచేయదగు "సూర్యుని నూత్నకిరణములచే తనహస్తమునందున్న రేఖలు కన్పించుకాలముదితమనఁబడు, ఆకాలమున హోమముచేయదగు, సాయంకాలమున సూర్యుఁడస్తమించి నక్షత్రములుదయించకపూర్వము హోమముచేయదగు.

## ఆ శ్వ లా య న మ త ము.

సాయంకాలమున సూర్యుడు అస్తమించినపిమ్మటను ప్రాతఃకాలమున, సూర్యుడుదయించినపిమ్మటను హోమము యథావిధిగఁజేయదగు.

## అందు గౌణకాలము.

ప్రాతర్హోమమునకు సంగవకాలముదాటుకరకును, సాయంకాలహోమమునకు సూర్యుడస్తమించినపిదప తొమ్మిదిగడియలవరకును గౌణము దుర్భిక్షము, రాష్ట్రసంచారము, దేహమునకానారోగ్యము ఈమొదలగు ఆపత్తులయందు గౌణకాలములు చెప్పఁబడియె, స్వస్థుడైయున్నపుడీకాలముల హోమముచేయజనదు అట్లుగౌణకాలమునందు చేయునపుడు వ్యాహృతులచే ప్రాయశ్చిత్తహోమముచేసినపిమ్మట ప్రకృతికర్మనాచరింపదగు.

## ముఖ్యకాలహోమాతీత ప్రాయశ్చిత్తము.

చంద్రశేఖరమునందు, ముఖ్యకాలమతిక్రమించినచో గౌణకాలమునందు సర్వప్రాయశ్చిత్తహోమముచేసి నిత్యహోమముచేయవలయు గౌణకాలముదాటినను ఇష్టికాలపర్యంతము ప్రత్యేకము సర్వప్రాయశ్చిత్తముచేసి అతిక్రమించిన హోమములననుష్ఠింపనగు ముఖ్యకాలమునందు కర్మచేయుటకు వీలుబడనపుడు గౌణకాలమందైనను చేయదగు ఆపత్సమయమున గౌణకాలమును ముఖ్యకాలమువంటిదేయగు కారికా కారుడు...ముఖ్యకాలమతిక్రమించినపుడు సమస్తవ్యాహృతులచే నొకయాజ్యాహుతి వేల్చదగు ప్రాయశ్చిత్తవిధి యెచ్చటచెప్పబడియుండదో అచ్చట "భూర్భువస్సువః" అను సమస్తవ్యాహృతులచే నొక యాజ్యాహుతి వేల్చదగు.

## హోమాతీతప్రాయశ్చిత్తము.

ప్రాతఃకాలహోమమునకు, సాయంకాలమువరకును సాయంకాలహోమమునకు ప్రాతఃకాలమువరకును అధమకాలము ఈకాలములుదాటినచో "మనోజ్యోతిః" అనుమంత్రములచే వేల్చదగు మూడురాత్రులవరకు 'అయాశ్చ' అనియు, ఏడురాత్రులవరకు మహిస్వతిమంత్రములచేతను పదునొకండురాత్రులవరకు తంతుమతీ మంత్రములచేతను వేల్చదగు పండ్రెండవదినమున యగ్నినష్టమైనచో కొందరు నాల్గుహోమములతిక్రమించినను సర్వప్రా

యశ్చిత్తమేనని చెప్పెదరు, ఆపక్షమునందు గడచినహోమములు తిరిగిచేయనక్కరలేదు. గ్రంథాంతరమునందు గౌణకాలమతిక్రమించినచో "మనోజ్యోతిః" అనుమంత్రముచే నాల్గు పర్యాయములు గ్రహింపబడిన యాజ్యమును చేయనగునని చెప్పఁబడియె.

## హోమలక్షణము.

వ్రేళ్లచిగుళ్లచే హోమముచేయఁజనదు వ్రేళ్లను విడఁదీయక వ్రేళ్లయొక్క ఉత్తర పార్శ్వమునుండి హోమముచేయదగు, ఇట్లు సాయం ప్రాతస్సంధ్యాకాలములయందు హోమముచేసి యుపస్థానము జెప్పఁదగు.

## నిత్యహోమప్రకారము.

ప్రాణాయామముచేసి "ప్రాతరౌపాసనహోమంకరిష్యే" అనిసంకల్పించి అగ్నికి చుట్టును, జలమున్ప్రోక్షించి అక్షతలచేగాని, యవలచేగాని అగ్నినలంకరించి, పరిషేచనముచేసి, ప్రాఙ్ముఖుఁడై "సూర్యాయస్వాహా" అని హస్తముచే అగ్నిమధ్యయందు వ్రేల్చి పిమ్మట "అగ్నయేస్విష్టకృతేస్వాహా" అని ఈశాన్యమున హోమముజేయదగు, అందు మొదటియాహుతికంటె రెండవయాహుతిద్రవ్యంకొంచెము పెద్దదిగానుండవలయు, ఈయాహుతులకు, పరస్పరముసంబంధముకూడదు అట్లు సంసర్గకలిగినచో 'యత్ర వేత్థవనస్పతే' అను మంత్రముచే నొకసమిధ నగ్నియందుంచవలయు పిమ్మట యుత్తరపరిషేచనము ఈవిషయమై కారికయందు మొదటియాహుతితో రెండవయాహుతికి సంబంధముకలిగినచో "యత్ర వేత్థవనస్పతే" అనుమంత్రముచే వనస్పతినుద్దేశించి స్వాహాకారశూన్యముగానొక సమిధను వేల్చదగు పిమ్మట అంజలిబద్ధుఁడైలేచి "అగ్నేత్వన్నో అన్తమః...అస్మాత్" అనియుపస్థానముజెప్పి కూర్చుంచి "స్వస్తిశ్రద్ధాం మేధాం...హవ్యవాహన" అని కన్నులను స్పృశించి యగ్నికి నమస్కారముజేయవలయు ఇట్లే సాయంకాలహోమము, అందువిశేషము ప్రాణాయామముజేసి "సాయమౌపాసనంతండులైర్హోష్యే" అని సంకల్పించి అలంకరించి పరిషేచనజేసి "అగ్నయేస్వాహా" అని మొదటిహోమముజేయనగు, అగ్నయే స్విష్టకృతేస్వాహా ఇట్లు యావజ్జీవము తానేహోమము జేయవలయును.

## తానుహోమముచేయదగనికాలము.

ఎవ్విధమైన బాధకమునులేనప్పుడు యజమానుడే హోమముజేయదగు ఆశౌచాదికమునందు మరియొకనిచే జేయింపఁదగు ఈవిషయమున బృహస్పతి సూతకము (జాతాశౌచము) మృతాశౌచము, శక్తిలేకపోవుట, శ్రాద్ధభోజనము, పరదేశగమనము, మొదలగు

నిమిత్తములయందు హోమమును ఇతరులచే జేయింపవలయునే గాని తానుజేయజనదు.—
ఆశ్వలాయనుడున్నూ— స్మార్తాగ్నిని జాతాశౌచమునందును మృతాశౌచమునందును
తానుహోమముజేయజనదు స్మార్తాగ్నియనుటవలన శ్రౌతాగ్నివిషయమై దోషములేదు
ఈవిషయమున యముఁడు శ్రౌతకర్మజేయవలయుకాలమున జాతాద్యాశౌచముపోయి
తాత్కాలికమగు పరిశుద్ధతగల్గునను విశేషవచనముచే యజమానునికే యధికారముకలదు.
స్త్రీగాని, అనుపనీతుడగు పురుషుడుగాని హోమముజేయజనదు, కర్త ఆశక్తుడైనచో
ఋత్విక్కు మొదలగువారిచే హోమముజేయింపదగు.

## కృష్ణభట్టీయమునందు.

ఋత్విక్కు కుమారుఁడు గురువుతోబుట్టినవాడు, మేనల్లుడు, అల్లుడు, వీరు తనకు ప్రతినిధిగా హోమముజేయదగుదురు, హోమమగువరకు పత్నిభుజింపజనదు తానుసమీపమునలేకున్నను ఇట్లేకాదగు.

## గ్రంథాంతరమునందు విశేషము.

పత్ని, పుత్రుడు, పుత్రిక, శిష్యుడు, జ్ఞాతి, బంధువుడు, ఋత్విక్పుత్రుడు, గురువు, తోబుట్టినవాడు, మేనల్లుడు, అల్లుడు, వీరు హోమముజేసినచో తానుచేసినట్లేయగు భర్త గ్రామాంతరగతుడైనచో భార్య ప్రతినిధులచే ప్రాతస్సాయంకాలములయందు హోమము చేయింపదగు.

## దంపతులసమక్షమునందు జేయబడనిహోమము.

భార్యాభర్తలయొక్క అసమక్షమున ఋత్విక్కు మొదలగువారు హోమముజే యజనదు ఇరువురకును సమక్షమగు హోమమునిరర్థకమగు.

## సమస్యహోమము.

అగ్ని సాయంకాలముత్పన్నమగు ప్రాతఃకాలమందగ్ని సంధానములేదు. సాయంకాలమే విధింపఁబడియెం పగటియందు పునరాధానముజేసినచో సమస్యహోమముజేయ దలచినవాడు ఆపగటియందు ప్రాతహోమముమాత్రముజేసి సాయంకాలము మొదలుగా ఆసాయంకాలమువరకు మరుసటి ప్రాతఃకాలమువరకు సంబంధించిన ఆహుతిహుతులను వ్రేల్చదగు సాయం ప్రాతహోమముల నేకముగా సాయంకాలమునందే జేయదగునని బోధాయనుఁడు జెప్పె.

## పక్షహోమాదులు.

స్మార్తప్రయోగచంద్రికాకారుడు దేశకాలాదిదోషముచేతను సూతకాదులు సంభవింపబోవునపుడును రోగాదియుపద్రవములయందును సాయంప్రాతర్హోమములను కలిపి పక్షహోమముజేయనగు. అనఁగా ప్రతిపత్తున సాయంకాలమున ఆప్రతిపత్సాయంకాలహోమము మొదలు చతుర్దశీసాయంకాల హోమపర్యంతముగల హోమములను సమానతంత్రిగావేల్చి ద్వితీయనాటి ప్రాతఃకాలమున ఆప్రాతర్హోమమాదిగా అమావాస్య లేక పూర్ణిమ ప్రాతర్హోమపర్యంతముగల హోమములను సమానతంత్రముగాను వేల్పదగు ఈహోమములయందు ప్రత్యేకము పరిషేచనాదికములేదు ఇట్లే మాసహోమమును జేయఁదగుఅటులైనలేదు లేక యొకకాలమునందే "పక్షహోమాన్ హోష్యే" "మాసహోమాన్ హోష్యే" అని సంకల్పించి సాయంప్రాతర్హోమములనన్నింటిని కలిపివిధిగ చేయఁదగు.

## మతాంతరము.

సాయంకాలము సాయమాహుతులు ప్రాతఃకాలమున ప్రాతరాహుతులు అతినిర్మలములగు తండులములను వేరువేరుగా నవదానముజేసి యొక్కొక్కభాగమును రెండుగా విభజించి తక్కువభాగమును ప్రథమమున యగ్నికి (సూర్యునకు) ను రెండవభాగమును స్విష్టకృద్ధోమమును జేయఁదగు ఈహోమములుజేయుటలో తండులములు వ్రేళ్ళయందలి మొదటిపర్వమునుదాటి రెండవపర్వమునకు లోబడియుండవలయును, మాసహోమమునుజేసెడిపక్షమున ఆజ్యసంస్కారముజేసి రాబోయెడి ప్రతిపత్తునకు సంబంధించిన హోమముల సంకల్పపూర్వకముగాజేసి పిమ్మట రెండవపక్షమునకు సంబంధించిన సాయంహోమముల జేసి ఇట్లే మఱునాటి ప్రాతఃకాలము ప్రాతర్హోమములజేసి యటుపిమ్మట వెళ్లఁదగు అందుసంకల్పము ప్రతిపత్సాయంకాలమున అగ్నినిప్రజ్వరిల్లజేసి ప్రతిపదం ప్రక్రమ్య చతుర్దశీసాయంకాలపర్యంతం సర్వాన్పక్షసాయహోమాన్ ప్రతిపదిసాయంతంత్రేణైవహోష్యామి అనిసంకల్పించి అలంకరణాదికముజేసి పిమ్మట ప్రతియాహుతిని వేరువేరుగా నవదానముజేసి స్రుక్కునందుంచబడిన తండులములగ్రహించి రెండుభాగములుజేసి అందుకొంచెము తక్కువభాగమును "అగ్నయెస్వాహా" అని వేల్చి అవశిష్టభాగమును "అగ్నయేస్విష్టకృతెస్వాహా" అనియు వేల్పదగు పరిషేచనాదికమౌపాసనమందువలె జేయనగు రెండవయాహుతికంటె మొదటియాహుతి తక్కువగానుండుటయు సాధారణము ఇట్లుజేసి మరుసటిదినము ప్రాతఃకాలమున వెనుకటివలెనే అగ్నినిప్రజ్వరిల్లజేసి "ద్వితీయాప్రాతః

ప్రభృతిపౌర్ణమాసీప్రాతః పర్యంతం అమావాస్యా ప్రాతఃపర్యంతం సర్వాన్పక్షప్రాతర్హోమాన్ద్వితీయాప్రాతస్తంత్రేణైవహోష్యామి" యని సంకల్పించి సూర్యాయస్వాహాయను పూర్వాహుతితో వెనుకటివలె వేల్చవలెను శేషముసమానము.

## శేషహోమలక్షణము.

పక్షమధ్యమున తగునిమిత్తము సంభవించినచో అష్టమియందుగాని దశమియందుగాని సాయంకాలము పక్షమునందు శేషించిన సాయంహోమములను వెనుకటివలెవ్రేల్చి నవమినాడుగాని ఏకాదశినాడుగాని ప్రాతఃకాలము అవశిష్టపక్షప్రాతర్హోమముల నాచరింపవలెను దీనినే శేషహోమమనియెదరు.

## మే ధా వి ల క్ష ణ ము .

హోమాంతరమగ్నియందలి భస్మమును "మేధావీభూయాసం" అని లలాటాదుల తిలకములధరించుతరి యగ్నికి పూర్వభాగమునందలి భస్మగ్రహింపవలెను దక్షిణమున నాయుర్వృక్షీణమగు పశ్చిమమున బుద్ధికి సంతాపముకల్గు ఉత్తరమున మరణముగల్గు మధ్యభాగమున గ్రహించినచో దినదినము నాయువృద్ధినొందు జలముతోగూడిన మేధావిని ధరించుటనిష్ఫలము కాన నిర్జలముగానేధరింపవలెను. ఎవనికి శ్రౌతస్మార్తరూపములగు రెండగ్నులుగలవో వాడు శ్రౌతాగ్నిహోత్రము ముందుజేసి పిమ్మట స్మార్తముజేయవలెను కొందరు స్మృతులు వేదమూలకములుగాన స్మార్తమునే ముందాచరింపఁదగుననిరి.

## అగ్నినివిడచినచో దోషము.

గర్గుడు వివాహమాడినవాడు క్షణమైన నగ్నిలేకయుండజనదు, అట్లుండినచో వ్రాత్యుడు, పతితుడు, యనఁబడు భార్యజీవించియుండగా అగ్నిని త్యజించినవాడును, కర్మహీనుడును బ్రాహ్మణుడు సూర్యచంద్రులుండువరకు నరకమునొందుదురు.

## సమావర్తనాది కర్మలోప ప్రాయశ్చిత్తము.

స్నాతకము, ఆగ్రయణము, వీట్లకులోపముగలిగినచో పుంసవనాదులు లోపించినప్పుడువలె ప్రాయశ్చిత్తముజేయవలెను అనేకవిధములతిక్రమించినచో వారుణమంత్రముల జపింపవలయునని యాగర్గుడేచెప్పెను. సర్వకర్మవ్రతలోపమున పాహిత్రయోదశహోమము జేయఁదగును.

## పాహిత్రయోదశహోమము.

ప్రయోగపారమునందు బ్రహ్మచారి గృహస్థులయగ్నులకు ఉపఘాతకము కలిగి

నప్పుడును బ్రహ్మచారి అగ్నియందు గృహస్థుడు గృహస్థాగ్నియందు బ్రహ్మచారియు హోమముజేసినను ఆగ్రయణహోమముజేయక క్రొత్తధాన్యమును భక్షించినను సంస్కా-రింపఁబడిన యాజ్యపృష్ఠ్యమైనను మంత్రములయొక్క న్యూనాధికతలయందును సీమంతముజేయక ప్రసవించినను హవిస్సు మొదలగువానిని గోవు ఆఘ్రాణించినప్పుడు కవలపిల్లలు జనించినప్పుడును రజస్వలయగుస్త్రీని పొందినప్పుడును పతితునితో సంభాషించునప్పుడును పగటియందు రతిజేసినను శూద్రస్త్రీని పొందినప్పుడును స్వప్నమందు రేతస్స్ఖలనమందును జలమున మూత్రపురీషముల విడచినను దేవతలనుగూర్చి హోమముజేయుటలో విపర్యాసముగా (అనఁగా ముందు జెప్పఁదగిన దేవతను వెనుక వెనుక జెప్పఁదగిన దేవతను ముందు లేక ఆయా మంత్రములను జెప్పదగు దేవత గాక మతియొక దేవతను) జెప్పినను సమాసములోను జేయదగిన సంస్కారముల జేయకయే యుపనయనముజేసినను బ్రహ్మచారివ్రతములకు విపర్యాసము గలిగినను దండము యజ్ఞోపవీతము మౌంజి, కృష్ణాజినము ఇవి ఛేదింపబడినను సంధ్యా అగ్నికార్యము వీట్లకు లోపము గలిగినను ఇంకను ఇట్టినిమిత్తములు గలిగినప్పుడు "పాహినో అగ్నే" అనునవి మొదలగు నైదిటిచేతను "పునరూర్జా" అనునవి మొదలగు రెంటిచేతను హోమములు జేయదగు ఈ పాహిత్రయోదశహోమములకు పూర్వాపరములయందు మహావ్యాహృతి హోమములు జేయఁదగు.

## వివాహమైనతరువాత నాశౌచాదినిమిత్తములచే స్థాలీపాక మొనర్పకయే పర్వమతిక్రమించినచో తద్వ్రతలోపము నందు ప్రాయశ్చిత్తము.

ఒకపర్వమతిక్రమించినచో "అగ్నేనయసు విధేమస్వాహా" అగ్నయ ఇదం అనియు తద్వ్రతలోపమునందు "త్వమగ్నేవ్రతపాః ఈడ్యస్స్వాహా" అగ్నయ ఇదం అనియు హోమముజేసి అనాజ్ఞాతత్రయహోమములు జేసి స్థాలీపాకమునొనర్పవలయు, వివాహమునందు రాత్రి తొమ్మిదిగడియలకు పూర్వమాగ్నేయస్థాలీపాకమొనర్చి యౌపాసనముజేయదగు తొమ్మిదిగడియలు దాటినచో స్థాలీపాకముమాత్ర మొనర్చి మరునటిసాయంకాలమౌపాసనమారంభింపదగు, ఇది ముఖ్యపక్షము రాత్రిని మూడుభాగములు జేయ మొదటిభాగమున స్థాలీపాకమును హోమమును జేయవలయును రెండవభాగమున స్థాలీపాకము జేయదగు నిత్యహోమము జేయజనదు మూడవభాగమున ఈ రెంటిలో నేదియు జేయజనదు.

## ఆగ్నేయస్థాలీపాకవిధానము

అందుముందుగా నాగ్నిస్థాలీపాక కారికలు విశ్వప్రకాశికయందు పాణిగ్రహణమైనపిదప వరుడుత్తరభాగమునందు గూర్చుండి ప్రాణాయామముజేసి వివాహాగ్ని సిద్ధ్యర్థం ఏనాంవధూమాగ్నేయ స్థాలీపాకేనయక్ష్యే అని సంకల్పించి పత్నియన్వారబ్ధయైయుండ వరుఁడే హోమముజేయదగు అందగ్ని ప్రధాన దేవత స్విష్టకృత్తు అంగదేవత వ్రీహివికారమగుచరువుచే యజింపదగు వాయవ్యాగ్రముగా పరువబడిన కృష్ణాజినమునకుమధ్యను లూఖలమును (రోటిని) ఉంచి పత్ని రోకలిగైకొని బియ్యముదంపదగు, పిమ్మట చేటయందుంచి చెరగవలయు అట్టితండులములను ప్రోక్షించి కడిగి వధువుచేనివ్వబడిన తండులములను అగ్నయెజుష్టంనిర్వపామి అని యొకపర్యాయము చరుస్థాలియందుంచి తిరిగియమంత్రకముగా మూడుపర్యాయములు ఆతండులములను చరుస్థాలియందుంచి "అగ్నయెజుష్టం ప్రోక్షామి" అనియొకపర్యాయము సమంత్రకముగాను రెండుపర్యాయములమంత్రకముగాను ప్రోక్షించి అందుజలమునుంచి అగ్నిపైనుంచి హోమమునకు బ్రాహ్మణునకు సరిపడు చరువునువండి అభిఘరించి తూర్పుగాగాని యుత్తరముగాగాని జరిపి తిరిగియభిఘరించి సౌకర్యముకొరకగ్నికి పశ్చిమమున నాజ్యమునుగూడనుంచి యభిఘరించి అగ్నినిప్రజ్వరిల్లజేసి ఆజ్యభాగాంతమున హోమముజేయదగు ఇచ్చట శమ్యలుకావు ముఖాహుతియులేదు పిమ్మట స్రుక్కును ఉపస్తరణజేసి చరుమధ్యనుండి రెండుపర్యాయములు గ్రహించి అభిఘరించి మిగిలిన చరువునున్నూ అభిఘరించి పత్నియన్వారబ్ధయైయుండ అగ్నయేస్వాహా అని యగ్నిమధ్యయందు వేల్చదగు తిరిగిస్రుక్కునందభిఘరించి ఉత్తరార్ధమునుండి యొకపర్యాయము గ్రహించి రెండుపర్యాయములభిఘరించి మిగిలినచరువునభిఘరింపకయె "అగ్నయేస్విష్టకృతేస్వాహా" అని ఈశాన్యమున వేల్చదగు అనాయాజసమిధను ఇధ్మసన్నహనమును అగ్నియందుంచి జయాదులు సమస్తములగు రాష్ట్రభృత్తులు ప్రాయశ్చిత్తాహుతులు వేల్చి స్రుక్కుచే పరిధులతుడచి పాత్రాసాధనకాలము పరువబడిన దర్భాగ్రములను దర్వియందభ్యంజనముజేసి (తుడచి) స్రువమును మధ్యమూలములచేతను ఆజ్యస్థాలిని మూలములచేతను తుడువదగు మూలముల నభ్యంజనముజేయునపుడు కుడిచేతినధోముఖముగా జేయుజనదు బర్హిస్సునుండి యొకదర్భను విడిగానుంచి మిగిలినబర్హిస్సును స్రుక్కునందుంచి యజింపబడిన దేవతలనుద్దేశించి అగ్రములనగ్నియందుంచి మూడుపర్యాయములంజలిపెత్తి విడిగానుంచబడిన దర్భనగ్నియందుంచి మూడుపర్యాయములు వ్రేలిచేనిర్దేశించి యగ్నినభిమంత్రించి మధ్యపరిధినగ్నియందుంచి మిగిలినరెండుపరిధుల నొకపర్యాయముంచుచు నందు

త్తరపరిధినంగారములయందు గుచ్చవలెను పరిధులనభిమంత్రించి ఆఘారసమిధలనగ్నియందుంచి స్రుక్కునందు స్రువమునుంచి విశ్వేదేవతులకొఱకు సగ్గస్రావభాగముల వేల్చవలెను.

## ఆగ్నేయస్థాలీపాకాది సర్వస్థాలీపాకవిధి.

సుదర్శనకారికలు వధూవరులు వాయవ్యాగ్రమగు కృష్ణాజినమున నులూఖమునుంచి అందువడ్లనుంచి పత్ని ముసలముగైకొని వాటినిదంపి చెరిగి పొట్టులేకుండునట్లుజేసి కడుగవలయు ఇదియంతయు నమంత్రకమేయగు పిమ్మట హోమమునకు బ్రాహ్మణునిభుజింపజేయుటకు తగిన చరువునువండి అభిఘరించి తూర్పుగాని యుత్తరముగాగాని జరిపి అభిఘరించి సౌకర్యముకొరకాచరుస్థాలి నగ్నికి పశ్చిమమునకుదెచ్చి తిరిగి యభిఘరించి అగ్న్యుపసమాధానము మొదలాజ్యభాగాంతముజరుపవలెను ఇచ్చట పరిధులేగాని శమ్యలుగానేరవు ముఖాహుతిలేదు పిమ్మట వధువుచే నన్వారబ్ధుడై స్రుక్కునుపస్తరణజేసి చరుమధ్యమండి తిరశ్చీనముగానొక పర్యాయమును చరువుయొక్క పూర్వార్థమునుండి అనూచీనముగా రెండవసారిగ్రహింపవలెను జమదగ్నివంశజులుమాత్రము పశ్చిమార్థమునుండి మూడవపర్యాముగూడ గ్రహింపవలెను ఇట్లుగ్రహింపబడిన హవిస్సునభిఘరించి ప్రత్యభిఘారముజేయవలెను ప్రధానాహుతులనేకములైనపుడు వానియంతమున ప్రత్యభిఘారణము. పిమ్మట "అగ్నయేస్వాహా" అని యగ్నిమధ్యమున వేల్చవలెను లేక చరుమధ్యమునుండి యొకపర్యాయము గ్రహించి స్రుక్కుచే నగ్నిమధ్యమున వేల్చవలెను ఇచ్చట చతురవత్తముగాని పంచావత్తముగానిలేదు పిమ్మట యుపస్తరణజేసి ఉత్తరార్థమునుండి యొకపర్యాయముగ్రహించి హవిస్సును రెండుపర్యాయములభిఘరించి ప్రత్యభిఘారణముజేయకయే "అగ్నయేస్వాహా" అని యగ్నికీశాన్యముగాని చరుక్షేపణముజేసిన తావునకుత్తరార్థమునగాని స్రుక్కుచేనొకచోట వేల్చవలెను జమదగ్నివంశజులైనచో నీహోమమును రెండుపర్యాయములుగ్రహించి చేయవలెను బొటనవ్రేలిపర్వముయొక్క ప్రమాణమున ప్రధానదేవతలకు అవదానముజేయవలెను స్విష్టకృద్ధోమమున ప్రధానదేవతజెప్పబడిన ప్రమాణముకంటె ద్విగుణముగా నవదానముజేయవలెను దక్షిణాగ్రములగు (పైభాగముదక్షిణముగాగల) వేళ్లచేతను అంగుష్ఠముచేతను గ్రహించినచో తిరశ్చీనమనబడు ప్రాగగ్రములగు (అనగా పైభాగము తూర్పుగాగల) వ్రేళ్లచేతను అంగుష్ఠముచేతను గ్రహింపబడునది అనూచీనమనబడు—పిమ్మట పాత్రాసాదనకొఱకై పరువబడిన బర్హిస్సును హస్తములచేగ్రహించి అగ్రములను స్రుక్కునందును మధ్యమూలముల నితరదర్వియందు ఒకపర్యాయముగాని రెండుపర్యాయములుగాని మూడుపర్యాయములుగాని నభ్యంజనముజేయవలెను ప్రస్తరమునుండి యొకదర్భనుతీసి యొక

చోటనుంచి మిగిలినబర్హిస్సును కుడిచేయిపైగానుండునటుల స్రుక్కుపైనుంచి కర్మాంతమున నగ్నియందుంచదగు పిదపమూడుమారులంజలినెత్తి ప్రజ్ఞాతముగానుంచబడిన దర్భనగ్నియందుంచి యంగులిచే మూడుపర్యాయములు నిర్దేశించి అగ్నినభిమంత్రించి భూమిని స్పృశింపదగు ఇట్లుకర్మశేషమునుపూరించి బహ్వృచ్యాయుక్తముగా బ్రాహ్మణునిభుజింపజేసి పూజ్యుడగు యాబ్రాహ్మణునకొక వృషభమునుఇవ్వవలయు సుబోధకారికలు— పాత్రాసాధనకొరకై పరువబడిన దర్భలయొక్క అగ్రములను స్రుక్కునందు మధ్యమములను స్రువమునందు మూలములనాజ్యస్థాలియందు నభ్యంజనము ముమ్మారుజేయనగు పరిధులను స్రుక్కుచే నభ్యంజనముజేయదగు దర్భమూలములనభ్యంజనముజేయునపుడు కుడిచేతిని క్రిందుగాజేయవగు ఒకదర్భనుప్రజ్ఞాతముగానుంచి మిగిలినబర్హిస్సును స్రుక్కుపైనుంచి యజింపబడినదేవతలనుద్దేశించి ఆబర్హిస్సుయొక్క అగ్రములనగ్నియందుంచి మూడుపర్యాయములు దోసిలినెత్తి ప్రజ్ఞాతముగానుంచబడిన దర్భనగ్నియందుంచి మూడుపర్యాయములంగులిచే నిర్దేశించి యగ్నినభిమంత్రించి భూమిని స్పృశింపవలయు పిమ్మట జయాదిహోమములు పరిధిప్రహరణము స్రుక్స్రువములచే జేయబడు సంస్రావహోమము జేసి బ్రహ్మకు వృషభమునివ్వదగు. లాజహోమమునందుదక్క మిగిలిహోమములనెచ్చటెచ్చట ఆజ్యముయొక్కయు ఔషధి (చరువు) యొక్కయు విధిగలదో అచ్చటచ్చట గాంగేయునిరుతముచే బర్హిస్సమంజసముకలదు ఇట్లుచేసి యుత్తరపరిషేచనము పూర్ణపాత్రోద్వాసనముజేసి బ్రహ్మకు గోవునివ్వదగు ఆజ్యసమృద్ధమగు చరువుచే బ్రాహ్మణునిభుజింపజేయనగు. వధువుపూజింపబడిన వరునికొరకు వృషభమునివ్వదగు.

## వివాహమధ్యను పూర్ణిమవచ్చినచో అన్వారంభణీయము.

వివాహమైననాల్గవదినములోగా పూర్ణిమవచ్చినచో అన్వాధానపూర్వకముగానుపక్రమించి యాగముజేయదగు ఆపూర్ణిమయందు విధిపూర్వకముగా సంకల్పించి మరునటిదినము ప్రతిపద్యాగముజేయదగు ఆహితాగ్నికానివానికి ప్రథమచరువునందు (ఆగ్నేయస్థాలీపాకమున చెప్పబడిన దేవతలె పౌర్ణమాస్యాన్వారంభణీయందు దేవతలుగా రాదగుదురని పండితులుజెప్పిరి అన్వారంభణీయను పౌర్ణమాస్యాప్రాతఃకాలమె, కాలమని కపర్దిశిష్యులచే జెప్పబడెను అగ్నియు అగ్నావిష్ణువులును సరస్వతియు సరస్వంతుడును భగ అనునగ్ని యనునగ్నియు స్విష్టకృత్తనుఅగ్నియు వీరువరుసగా నీకర్మయందు దేవతలు అందు మొదటియారుగురు ప్రధానదేవతలు వీరినుద్దేశించి చేయబడు ప్రతిహోమాంతమునను వాపిః ప్రత్యభిఘారణజేయనగు లేపకార్యమును జేయదగు శేషముసమము.

## మరియొకవిశేషము.

ఖండమైనట్టియు క్షయమైనట్టియు సంక్రమణముతోఁగూడినట్టియు గురు శుక్ర మౌఢ్యము తన జన్మనక్షత్రము గ్రహణము వైధృతియోగము ఈదోషములతోఁగూడిన పూర్ణిమయందు అన్వారంభణీయముజేసినచో కర్తకును పత్నికి వారిపుత్రులకు నాశకరము అధికమాసమునందలి పూర్ణిమ, కృష్ణపక్షమునందలి అమావాస్యతో సమమైనది కాన ఆ పూర్ణిమ నుపక్రమింపఁ జనదు ఇక ప్రతిపత్తున యాగమెట్లు జరుపనగు.

## గృహ్యపరిశిష్టమునందు.

ప్రథమపర్వ, గ్రహణము, అధికమాసము, గురు, శుక్ర, మౌఢ్యము మొదలగువానిచే దుష్టమైనను ఆపర్వయందే యన్వారంభణీయము జేయదగు—ఆకాలమున అన్వారంభణేష్టి జేయఁజనదు, ప్రతిపత్తున యాగముజేయకున్నను నిత్యోపాసనకర్మ చేయుచుండదగు ఇదియుఁగాక నూతనముగా తీర్థగమనాదికము జేయఁజనదు. తీర్థోపరాగమునమాత్రము ఈదోషము వర్తింపదు. ఇవిమొదలగు ప్రమాదములచే ప్రథమపర్వ మతిక్రమించినచో పథికృతేష్టి జేయఁదగు.

## విశ్వప్రకాశికయందు.

విష్ణుని దినదోషము మాసదోషము మొదలగుహేతువులచే వివాహస్థాలీపాకానంతరము చేయవగిన ప్రథమ చరుక్రియకు కాలమగు పూర్ణిమయతిక్రమించుచో అనఁగా బోధాయనుఁడు, ఆపస్తంబుఁడు, మొదలగు ఆచార్యులచే ప్రథమచరువుకు పూర్ణిమయె కాలము అమావాస్యకానేరదని చెప్పఁబడె, స్థాలీపాకానంతరము ఔపాసము జేయబడుచుండగా పూర్ణిమవచ్చినచో వివాహమధ్యను శేషహోమముకంటె పూర్వముగూడ పర్వారంభము జేయదగునని మూలగృహ్య వ్యాఖ్యానమునఁ జెప్పఁబడియె కావ ప్రథమపూర్ణిమయందె ప్రథమచరువునకు కాలము. అట్టిపూర్ణిమ ప్రమాదముననతిక్రమించుచో పథికృతేష్టినిజేయదగు రెండవపూర్ణిమ యతిక్రమించుచో విభ్రష్టేష్టియు మూడవపూర్ణిమ యతిక్రమించుచో వైశ్వానరేష్టియు జేయఁదగు నాల్గవపూర్ణిమ యతిక్రమించుచో సాగ్నికుడగు బ్రాహ్మణుఁడు తంతుమతీష్టిని జేయవలయు అగ్ని విచ్ఛిత్తియగుచో పునస్సంధానపూర్వకముగా ప్రతిపత్తున నీతంతుమతీష్టియే జేయఁదగు ఐదవపూర్ణిమ యతిక్రమించినచో సాగ్నికుండైనను తిరిగి యగ్నిసిద్ధికొఱకు పునస్సంధానముఁ జేయవలయు పిమ్మట పూర్ణిమయందన్వారంభణీయము జేయఁదగును.

## అన్వారంభణీయ ప్రయోగము.

పృథక్ కృష్ణీయమునందు చెప్పబడియె. పూర్ణిమయందు ప్రాతఃకాలమున, ఇధ్మ బర్హిస్సుల నాపాదించి ప్రాతరౌపాసనహోమముజేసి యుపస్థానముజెప్పి వరుడు కుడివైపునకూర్చుండి ప్రాణాయామముజేసి "మమదర్శ పూర్ణమాస స్థాలీపాక సిద్ధ్యర్థమన్వారంభణీయ స్థాలీపాకేనయక్ష్యే" అనియు "పౌర్ణమాస్యామాపస్తంబోక్తవిధినా అగ్నిం అగ్నింస్విష్టకృతం అగ్నావిష్ణ్వాది చతస్రః ప్రథమచరు దేవతాశ్చ స్విష్టకృదంత దేవతాంచ స్థాలీపాకేన సద్యోయక్ష్యే" అని సంకల్పించి "విద్యుదసి" అని యుదకమును స్పృశించి అగ్నికి పరిసమూహనము, అభ్యుక్షణము, అలంకరణము, పరిస్తరణలు మొదలగు క్రియ లైనపిమ్మట "పత్న్యవహన్తి" అని వెనుక చెప్పబడిన క్రమముగా నాయగ్నియందు చరువునువండి యభిఘరించి తూర్పుగాగాని యుత్తరముగాగాని జరిపియుంచి తిరిగి యభిఘరించి అగ్నికి యుత్తరముగా దర్భలపరచి యందు "దర్వ్యాజ్యపాత్రేణ" అను విధినను సరించి పాత్రలనాపాదించి ఇధ్మసమీపమునందు చరుస్థాలి నాపాదించి పవిత్రసంస్కారము మొదలుకొని యగ్నిముఖాంతమున చరుస్థాలిని తనకు ముందుగానుంచుకొని "ఉపస్తరణాభిఘరణౌ చతుర్గృహీతం (ఉపస్తరణము ౧ అవదానములు ౨ అభిఘారణము ౧ మొత్తము నాల్గగునట్లు) అను న్యాయసూత్రానుసారము స్రువముచే స్రుక్కునను పస్తరణజేసి చరువును రెండుపర్యాయములు గ్రహించి యభిఘరించి వ్రేల్చదగు ఈమేదాహుతులయందును జమదగ్ని వంశజులు, చరువును మూఁన్మారవదానము జేయదగు. స్థాలీపాకమునందువలెనే పరిషేచించి "అగ్నయేస్వాహా" "అగ్నయేస్విష్టకృతేస్వాహా" "అగ్నావిష్ణుభ్యాగ్ంస్వాహా సరస్వత్యైస్వాహా" "సరస్వతేస్వాహా" "అగ్నయేభగిణేస్వాహా" అని ఈయారాహుతుల వ్రేల్చి, లేపము నోషధులనుద్దేశించి బర్హిస్సునందు తుడచి వెనుకటివలెనె చరువునుగ్రహించి "అగ్నయేస్విష్టకృతేస్వాహా, అనిస్విష్టకృద్ధోమముజేసి ప్రాచీనావీతియై పితరులనుద్దేశించి యగ్నిదక్షిణముఖముగా భూమియందు లేపమును తుడచి తిరిగియుపవీతియై యుదకమును స్పృశించి చరుశేషమును ప్రాశనకొఱకు పాత్రాంతరమునందుంచుకొని ప్రాఙ్ముఖుఁడై కూర్చుండి యొకమారు ప్రాశనజేసి తిరిగి యథాస్థానమునకువచ్చి కూర్చుండి, సమిత్సన్నహనము, జయాదులు, ఉత్తరపరిషేచనమువరకుజేసి ప్రణీతామార్జనమైనపిమ్మట బ్రాహ్మణు పూర్ణపాత్రము దక్షిణగానిచ్చి ఉద్వాసనముజేసి "వృష్టిరసి" అని యుదకమును స్పృశింపవలయును ప్రథమచరువునందుమాత్రము ఈ దేవతా విశేషము మరియొకప్పుడులేదు అనిచెప్పెదరు.

## పథికృత్ స్థాలీపాకము.

మాఘ్యాదిహోమములవలనగాని ప్రమాదమువలనగాని ప్రథమ ప్రథమ పర్వమతిక్రమించినచో పథికృత్ స్థాలీపాకము జేయవలెను అందు కారికలు విశ్వప్రకాశికయందు మాఘ్యాదినిమిత్తములచే నొకపర్వమతిక్రమించుచో పథికృద్ధోమము జేయవలెనని హోమవేత్తలు జెప్పిరి. మరియు మొదటిపూర్ణిమగాని దర్శగాని యతిక్రమించుచో పథికృదిష్టిని జేయవలెను, శ్రౌతమునందు అవశ్యపశువు సంవత్సరములోగా జేయబడినచో నిట్టిప్రాయశ్చిత్తము జేయఁదగును.

## పథికృత్ స్థాలీపాక ప్రయోగము.

ప్రాణాయామముజేసి "మమప్రథమ ప్రతిపదః అతిక్రమ దోషప్రాయశ్చిత్తార్థం పథికృదిష్ట్యాయక్ష్యే" అని సంకల్పింపవలయును ఇందు పథికృదగ్ని ప్రధానదేవత, స్విష్టకృదగ్నియంగదేవత చరుశ్రపణముజేసి "అగ్నయేపథికృతేస్వాహా" అనివ్రేల్పవలెను శేషమాగ్నేయస్థాలీపాకమువలె జేయఁదగును.

## విభ్రష్టేష్టి.

గురు శుక్ర మాఘ్యాదిదోషములచే ద్వితీయపర్వ మతిక్రమించుచో విభ్రష్టేష్టి నాచరింపఁదగు, అగ్ని, ఇంద్రుడు, సోముడు, స్విష్టకృత్, ఈ దేవతల నిర్మంత్రపూర్వకముగా యజింపదగు. జయాదులుగూడ జేయదగు " మమద్వితీయేష్ట్యతిక్రమదోషపరిహారార్థం విభ్రష్టేష్ట్యాయక్ష్యే తత్రాగ్నీంద్రసోమాస్త్రయః ప్రధానదేవతాః స్విష్టకృదంగదేవతా చరుద్రవ్యేణ సద్యోయక్ష్యే" అని సంకల్పించి చరువునువండి హోమముజేయదగు శేషము పథికృతేష్టితో సమము.

## వృద్ధకృష్ణియమునందు విశేషము.

సంకల్పించి పత్న్యవహన్తి అనునిది మొదలుగా చరుశ్రపణాంతముజేసి అగ్నిని ప్రజ్వలిల్లజేసి యాజ్యభాగాంతమువ పత్నియన్వారబ్ధయైయుండ "సప్రత్నవన్నవీయసా... భ్రానునోం" అనుపురోనువాక్యమునుచ్చరించి "విశ్వాన్యావేధనః...అమృతాది విశ్వాస్వాహా అగ్నయఇదం" అనియాజ్యముచే హోమముజేయదగు "ఇంద్రంవోవిశ్వతఃకేశకాన్" అనుపురోనువాక్యనుచ్చరించి "ఇంద్రంనరోనేమధితాహావన్తే...తన్నస్వాహా" అనుయాజ్యచేతను "త్వన్నస్సోమవిశ్వతః...సఖ్యోం" అను పురోనువాక్యనుచ్చరించి "యాతేధామానిదివ్యా...గృభాయస్వాహా" అనియుప్రేల్చి పిమ్మట సమిత్సన్నహనము

జయాద్యుత్తరపరిషేచనాంతరము బ్రహ్మోద్వాసనము జేయఁదగు విభ్రిష్టేష్టి జేయుటకశ క్తుడగుచో దానిస్థానమున పూర్ణాహుతి వేల్చదగు.

## విభ్రష్టేష్టి జేయుటకశక్తుడగునప్పుడు పూర్ణాహుతి.

అందు కారికాకారుడు వృద్ధకృష్ణీయమునందుచెప్పె బ్రాహ్మణుఁడు తగునిమిత్త మగలిగినపుడు విభ్రిష్టేష్టిజేయుటకశక్తుడగుచో నావిభ్రష్టేష్టికి మారుగా పూర్ణాహుతి నైనను వేల్చదగు, ఈవిషయమునందు పరిశిష్టకారిక "మమద్వితీయెష్ట్యతిక్రమ దోషపరి హారార్థం కర్తవ్యవిభ్రిష్టేష్టిస్థానే పూర్ణాహుతింహోష్యామి" అని సంకల్పించి యగ్నిని ప్రజ్వరిల్లజేసి యాజ్యభాగాంతమున నాల్గుపర్యాయములు గ్రిహింపబడిన యాజ్యమును సప్తహోతచే నిశ్శేషముగా హోమముజేయఁదగు పిమ్మట అనాజ్ఞాతాహుతులు సర్వ ప్రాయశ్చిత్తముజేయవలయు, బ్రిహ్మకు వృషభమునివ్వవలయు ఈవిషయమున మరియొక విశేషము—ఎవఁడు మొదటి పర్వమతిక్రిమించినపుడు జేయదగిన పదేకృధిష్టి మొదలగు వానిని జేయుటకు సమర్థుకాడో వాడు ఆయా యిష్టులయందు జెప్పఁబడిన దేవతలయొక్క నామములచే స్వాహాన్తముగా పూర్ణాహుతివేల్చదగు ఎచ్చటెచ్చట గ్రిహణసంఖ్యను జెప్పక పూర్ణాహుతి విధింపఁబడునో యచ్చట రెండుపర్యాయములాజ్యము గ్రిహింపదగు పూర్ణాహుతి పక్షమున ఇష్టే యన్నిటికిని ప్రియోగము.

## వైశ్వానరేష్టి.

విశ్వప్రికాశికయందు, మాధ్యాదులు, సూర్యసంక్రిమణము, గ్రిహణము, మొద లగు దోషములచే తృతీయపర్వమతిక్రిమించినవో నపుడు వైశ్వానరేష్టిని జేయదగునని, అత్రిమహర్షి చెప్పె.

## వైశ్వానరేష్టిప్రియోగము.

ప్రాణాయామముజేసి "ఇష్టిత్రియాతిక్రిమదోషపరిహారార్థం వైశ్వానరేష్ట్యా యక్ష్యే" తత్రాగ్నిర్వైశ్వానరో వరుణోదధిక్రావా ఇతి త్రిఃప్రిధానదేవతాః స్విష్ట కృదంగదేవతా, ఏకమేవవ్రీహిమయం చరుంత్రిధావిభజ్య త్రిహవిషాచరుణా ఇత్థంతం త్రేణసద్యోయక్ష్యే" అని సంకల్పించి చరుశ్రపణముజేసి యగ్నిముఖాంతమున సక్రిమ ముగా నవదానముజేసి "వైశ్వానరోనఊత్యా...భూరిరేతసా పృష్టోదివిపృష్టో...నక్తం" అను మంత్రద్వయముచే అగ్నయేవైశ్వానరాయేదం అనియు అవతేహేడోవరుణ—కృ తాని ఉదుత్తమం...స్యామ అను మంత్రిద్వయముచే వరుణాయేదం అనియు దధిక్రా

క్రివ్ణః...తారిషత్ ఆదధిక్రావ్ణ్ణో...వచాంసి అనుమంత్రిద్వయముచే దధిక్రావేభ్యఇదం అనియు వేల్చి పిమ్మట స్విష్టకృద్ధోమము జేయదగు శేషము నాగ్నేయస్థాలీపాకమందువలె పూరింపఁదగు.

## ప్రతిపద్ధోమకారికలు.

పూర్ణిమయందుగాని దర్శయందుగాని ఉపవసించిన భార్యాభర్తలచే చరువుచేయఁదగినది దర్శయందు 'దర్శస్థాలీపాకేనయక్ష్యే' అనియు పూర్ణిమయందు పౌర్ణమాసేనస్థాలీపాకేనయక్ష్యే అనియు సంకల్పించి ఇధ్మము మొదలగువానిని కట్టుకొనఁదగు, ఈపర్వమందు దంపతులకిష్టమగు పదార్థములోకపర్యాయము మాత్రము భుజింపఁదగు రాత్రియుపవసించి భూమియందు పరుండి మైథునమును వర్జింపఁగునని ఇధ్మసూత్రములయందు సూత్రకర్త చెప్పియుండె మరునాడు ప్రాతఃకాలము స్థాలీపాకముజేయువలయు ఆజ్యభాగాంతముజేసి యాజ్యముచేతనే "అగ్నయే" ముఖాహుతి వేల్చదగు పిదప ఆగ్నేయస్థాలీపాకమందువలె హోమముజేసి శేషము సమాప్తినొందింపదగు ఈప్రతిపద్యాగమున పత్నియన్వారబ్ధయైయుండ నవసరములేదు దక్షిణగా వృషభమునివ్వనక్కఱలేదు, పూర్ణపాత్రమే దక్షిణయని మునులు చెప్పిరి. రెండుపిడికిళ్లు కించిత్ అనఁబడు నాల్గుకించత్తులు పుష్కలమనఁబడు, నాల్గుపుష్కలములు పూర్ణపాత్రమనఁబడు.

## ప్రతిపద్ధోమప్రయోగము.

విశ్వప్రకాశికయందు పర్వయందన్వాధానముజేసి మరుసటిదినము యజింపదగు అందు ముందుగా నన్వాధానప్రయోగము చెప్పఁబడు. పూర్ణిమయందు ప్రాతరౌపాసనము జేసి దేశకాలసంకీర్తనపూర్వకముగా "పౌర్ణమాస్యాగ్నేయస్థాలీపాకేనయక్ష్యే" "తత్రాగ్నిఃప్రధానదేవతా స్విష్టకృదంగదేవతా వ్రీహిమయేనచరుణాశ్వోయక్ష్యే తత్రసాంగాస్సర్వేదేవతాస్సన్నిహితాస్సన్తు" అని సంకల్పించి విద్యుదసి యని యుదకమును స్పృశింపనగు ఇట్లే అమావాస్యయందు "అమావాస్యాగ్నేయస్థాలీకాకేనశ్వోయక్ష్యే" అని సంకల్పము ఇట్లన్వాధానముజేసి మరుసటిదినము ప్రాతరౌపాసనజేసి పత్న్యవహాన్తి అనుక్రమమున ఐదుపిడికెళ్లు తండులములను "అగ్నయేజుష్టంనిర్వపామి" అనురీతిని నిర్వపణము ప్రోక్షణము మొదలగునవి స్థాలీపాకమునందువలె యొనర్చి వెనుకటివలెనె హావిస్సునవదానము జేయదగు ప్రధానహోమమునుజేసినపిదప తత్సంబంధమగు లేపనును బహిస్సునతుడువవలయు స్విష్టకృద్ధోమాంతమున ప్రాచీనావీతియై తత్సంబంధమగు లేపము నగ్నికి దక్షిణభాగమున భూమియందు తుడువదగు. పిమ్మట యుపవీతియై హవిశ్శేషమును ప్రాశ-

సజేసి ఆచమనముజేసి అగ్నికి కొంచెము దూరముసరుపోయి హవిశ్శేషమును భక్షించి దర్వియందలి లేపమును కడిగి ఆచమనముజేయదగు ఇది అగ్నిహోత్రికవిధి గృహ్యకర్మలయందు అనాజ్ఞాతమంత్రజపముగూడ జేయదగు ఇదిస్మార్తాగ్నిహోత్రిక విధానమునందు మూలకారికలని దెలియఁదగును

## స్మార్తాగ్నిహోత్రికవిధి.

సుదర్శకారికయందు స్థాలీపాకము అష్టకాశ్రాద్ధము ఈశానబలి సర్పబలి మాసిశ్రాద్ధము వీటియందాగ్నిహోత్రికవిధి జెప్పబడె ఈకర్మలయందు కర్మనామము నుచ్చరించి యక్ష్యే అని సంకల్పించి అగ్నినిప్రతిష్ఠించి పత్న్యవహస్తి అనుక్రమముగా చరుశ్రపణముచేసి యభిఘరించి యుత్తరమునకుగాని తూర్పునకుగాని జరిపియుంచి యభిఘరించి అగ్నిని ప్రజ్వరిల్లజేసి పరిసమూహనము జేసి పశ్చిమమున ప్రాగగ్రములగు దర్భలపరచి ప్రధానహోమము స్విష్టకృద్ధోమము హవిశ్శేషప్రాశనము వీట్లకు సరిపడిన చరువును దర్వియందుంచి ఆదర్విని పరచిన దర్భలయందాసాదించి స్రువముచే గ్రహించుచు నాయామంత్రముల క్రమముగా ప్రధానాహుతుల నన్నిటినివేల్చి ఆకాశమునుచూచి అంగుష్ఠానామికలచే ప్రధానాహుతుల సంబంధమగు లేపమును బహిస్సునతుడచి తిరిగి స్రుక్కునుండి హవిస్సుగ్రహించి స్విష్టకృద్ధోమముజేసి ప్రాచీనావీతియై లేపమునంగులిచే స్ప్రశకయే కుశలచే భూమియందు తుడువదగు తిరిగియుపవీతియై స్రువమును దర్భలయందుంచి మధ్యమ అనామిక అంగుష్ఠములచే దర్వినుండి హవిశ్శేషమును గ్రహించి ప్రాశనజేసి తిరి ప్రాశనజేసి యాచమనము జేసి క్రిందిదర్భలతోగూడ దర్వినిహస్తమునందుంచుకొని యుత్తరముగా తిరిగి హవిశ్శేషమునంతయు తనహస్తమునందుంచుకొని దర్భలతోగూడ నాదర్విని పశ్చిమాగ్రముగా నాసాదించి హస్తమునందున్న హవిశ్శేషమునొక పర్యాయము ప్రాశనజేసి హస్తమును నాకి స్రుక్కును జలముచే పూరించి ఆజలమును భూమియందుంచి తచ్ఛేషమున శుద్ధ్యాచమనముచేసి యాదర్విని కుశోదకముచేసి ప్రక్షాళనము చేయవలయు.

## స్మార్తాగ్నిహోత్రిక ప్రయోగము.

విశ్వప్రకాశికయందు తిథ్యాదిసంకీర్తనముచేసి అన్వాధానముచేసి పత్న్యవహస్తి అనుక్రమముగా చరుశ్రపణముచేసి చతుష్పాత్రప్రయోగమున యగ్నిముఖాంతమున చరువుచే స్రుక్కునుపూరించి అందె మూడుభాగములుచేసి అగ్నయేస్వాహాయని యొకభాగమునువ్రేల్చి తల్లేపమును "ఓమదీభ్యఇదంనమమ" అనియుత్తరభాగమున తుడచి అగ్నయేస్విష్టకృతేస్వాహా అని ద్వితీయభాగను వ్రేల్చి తత్సంబంధమగు లేపమును ప్రాచీనవీ

తియై దక్షిణముగా భూమియందు పితృభ్యఇదంనమమ యని తుడచి మిగిలినమూడవభాగమును కొంచెముప్రాశనముచేసి ఆచమనముచేసి మరలప్రాశనముచేసి ఆచమనముచేసి యుత్తరముగా మరలి శేషమును భక్షించి హస్తమును నాకి యాచమనుచేయదగు విస్మృతి అనాజ్ఞాతాది ప్రాయశ్చిత్తాహుతుల వ్రేల్చి యుత్తరపరిషేచనాంతమున 'వృష్టిరసి' అని యుదకమును స్పృశింపదగు.

## గ్రంథాంతరమున విశేషము.

వృద్ధకృష్ణీయమునందు అగ్నిహోత్రిక విధిని వ్యాఖ్యానము చేయుచున్నారు. అమావాస్యయందును పూర్ణిమయందును ప్రాతరౌపాసనచేసి ప్రాణాయామముచేసి దేశకాలసంకీర్తనానంతరము పార్వణస్థాలీపాకోపక్రమార్థం అన్వాధానంకరిష్యే అని సంకల్పించి అందు అమావాస్యేనాగ్నిహోత్రిక విధానేనఅగ్నిం అగ్నిగ్గ్ంస్విష్టకృతంచ స్థాలీపాకేనశ్వోయక్ష్యే అని సంకల్పించి అన్వాధానముచేసి 'విద్యుదసి' అని యుదకమును స్పృశింపదగు ఇట్లే పూర్ణిమయందుగూడ చేయదగు మరుసటిదినము ప్రాతరౌపాసనము చేసి పత్న్యవహత్తియను క్రమముగా చరుశ్రపణముచేసి అగ్నికిపశ్చిమమున ప్రాగగ్రముగా బర్హిస్సును పరచి యందు దర్విని హవిస్సును ఆసాదించి అగ్నిముఖాంతమున హవిస్సుచే దర్విని (అనగా స్రుక్కును) పూరించి ప్రాదేశప్రమాణముగల పలాశసమిధను పైభాగమునందుంచి దర్విని బర్హిస్సున నాసాదించి స్థాలీపాకమునందువలె పరిషేచించి యగ్నినుద్దేశించి సమిధనగ్నియందుంచి ప్రధానాహుత్యనంతరము గాలినిపీల్చి విడచి కనులమూసి తెరచి ఓషధులనుద్దేశించి ప్రధానాహుతిసంబంధమగు లేపమును బర్హిస్సున తుడచి దర్విని బర్హిస్సున నాసాదించి యగ్నినభిమంత్రించి దర్వినిగ్రహించి అగ్నయేస్విష్టకృతే స్వాహా" అని మొదటిభాగముకంటె ఎక్కుడుగానుండునట్టియు ఉత్తరభాగమున నున్న రెండవభాగమును మూడుపర్యాయములవదానముచేసి వ్రేల్చి ప్రాచీనావీతియై పితరులనుద్దేశించి యగ్నికిదక్షిణభాగమున భూమియందు లేపమును తుడచి యుదకమునుస్పృశించి దర్విని బర్హిస్సున నాసాదించి వెనుకటివలెనే యుత్తరపరిషేచనముచేసి శేషమును ప్రాశనముచేసి యాచనముచేసి మరల ప్రాశనముచేసి యాచమనముచేసి దర్వినిగ్రహించి యుత్తరముగాదిరిగి హవిశ్శేషమును హస్తమునందుంచుకొని భక్షించి యాచమనముచేసి దర్వియందుదకమును ఆచమనముచేసి దర్విని దర్భచేప్రక్షాళనచేసి ఆచమనముచేసి దర్వియందుదకమును పూరించి దేవతలనందరనుద్దేశించి యగ్నికినలుదిశలయందున యాయుదకమునుంచి తిరిగిపూరించి తూర్పుగావిడచి నాల్గుపర్యాయములుపూరించి బర్హిస్సునందుంచి

శేషమును పత్నియొక్క దోసిలి యందుంచవలయు ఆమె సమీపమున లేనిచో కుశయందే యుంచవలయు అనాజ్ఞాతత్రియహోమములే జపముచేసి "వృష్టిరసి" యని యుదకమును స్పృశింపదగు.

## ప్రసంగవశమున పాకయజ్ఞవిధి జెప్పబడుచున్నది.

చంద్రిమాడమున, ఔపాసనము వైశ్వదేవము పర్వమునజేయబడు ఆగ్నేయస్థాలీపాకము అష్టక మాసిశ్రాద్ధము సర్పబలి ఈశానబలి ఇవి యేడును పాకయజ్ఞలనంబడు.

## అందు నిత్యోపాసనము.

సుదర్శనకారికయందు వివాహస్థాలీపాకానంతరము సాయంప్రాతః కాలముల యందు తండులములచేగాని యవలచేగాని పాణిచే రెండాహుతులవ్రేల్చదగు సాయంకాలమున "సాయమౌపాసనహోమంహోష్యే" అనియు ప్రాతఃకాలము "ప్రాతరౌపాసనహోమంహోష్యే" అనియు సంకల్పించి "అదితేనుమన్యస్వ" అనురీతిని పరిషేచించి "అగ్నయె స్వాహా" అని యగ్నిదేవతనుద్దేశించి హోమముజేసిన పిదప "అగ్నయేస్విష్టకృతేస్వాహా" అని హోమము జేయదగు ప్రాతఃకాలముల మొదటియాహుతిని "సూర్యాయస్వాహా" అని వ్రేల్చదగు మిగిలిన తంత్రము వెనుకటివలెనే జరిపి యుత్తరపరిషేచనము జేయందగు.

## వైశ్వదేవ స్థాలీపాకవిధి.

చంద్రిచూడమునందు సాయంప్రాతఃకాలములయందు వైశ్వదేవము బలిప్రదానము తాను భుజింపకున్నను నాచరింపదగు లేనిచో పాపవంతుడగును అన్నములభింపనపుడు ఫలము శాకము ఉదకము మొదలగువానిచేనైనను ఈవైశ్వదేవము జేయదగు పాలు పెరుగు నెయ్యి వీట్లచే వైశ్వదేవము జేయనపుడు స్రువముచేతను అన్నాదులచే జేయునపుడు హస్తముచేతను ఉదకముచే జేయునపుడు దోసిలిచేతను జేయందగు "వృద్ధిశ్రాద్ధమున ఆదియందును, ప్రత్యాబ్దికాదిక్షయ శ్రాద్ధములయంతమునను దర్శశ్రాద్ధమున, మహాలయమున మధ్యయందును వైశ్వదేవము విధింపఁబడె" నను స్మృతివచనము శాఖాంతర విషయమైగాని, నిరగ్నికునివిషయమైగాని ప్రవర్తింపదగు యికసాగ్నికులకెట్లన వైశ్వదేవమును పంచమహాయజ్ఞములును బ్రాహ్మణభోజనమునకు వండబడిన అన్నముకంటె ఇతరమగు యన్నముచే జేయదగునని సుదర్శనాచార్యులచే జెప్పఁబడె. మరియు సాగ్నికుఁడు శ్రాద్ధమునకుపూర్వమే వైశ్వదేవమును జేయదగుననియు పార్వణశ్రాద్ధము ఏకోద్దిష్టము వీటియందు ముందుగా వైశ్వదేవము జేయదగుననియు ఏకాదశాహమ్మున మాత్రముశ్రాద్ధా

నంతరము వైశ్వదేవము జేయవలయుననియు హేమాద్రియందు యమునిచే జెప్పఁబడె కాన పరిశేషన్యాయమున శ్రాద్ధమునకు పూర్వమె వైశ్వదేవము నిర్వర్తింపనగు.

హోమము అగ్రదానము ఇవిచేయక యెప్పుడును భుజింపజనదు సోదరుల విభక్తులైయున్నపుడొక డాచరించినను అందరు నాచరించినట్లేయగునని వ్యాసుఁడు జెప్పె. సోదరులవిభక్తులైయున్నప్పుడొక ధర్మమే యందరకు వర్తించు విభక్తులైనపుడు వారు ధర్మములుగూడ వేరగునని మితాక్షరయందు నారదుఁడు చెప్పె. ఒకపాకముతో వర్తించు విభక్తసోదరులలో నొకడే నాల్గు యజ్ఞములజేయదగునని యాశ్వలాయనుఁడు జెప్పె. అవి భక్తులైనను విభక్తులైలను పృథక్పాకముగల బ్రాహ్మణులు ప్రతిదినము భోజనమునకు పూర్వము యజ్ఞములనుగూడ వేరువేరుగా జేయఁదగునని స్మృత్యంతరమున జెప్పఁబడె. శాలాగ్నియఁదుగాని లౌకిగాన్నియందుగాని యన్నమును వండదగు అన్నము నేయగ్నియందువండెదరో ఆయగ్నియందే హోమముజేయదగునని మాధవీయమున నంగిరసుడు చెప్పె లౌకికాగ్నియందుగాని వైదికాగ్నియందుగాని జలమునందుగాని భూమియందుగాని పంచసూచనముల నివర్తింపచేసుకొనుటకొరకు వైశ్వదేవముచే జేయదగునని శాతాతపుడు జెప్పె. ఇది ఆశ్వలాయనవిషయము తైత్తిరీయులకు "ఔపాసనె పచనెవ" అను నీయమువలన ఔపాసనాగ్నిగల వారికౌపాసనాగ్నియందు లేనివారు పచనాగ్నియందును జేయవలయు "వైశ్వదేవము జేయకపూర్వము భిక్షువు భిక్షార్థమై వచ్చినపుడు వైశ్వదేవముకొఱకు కొంత భాగమునుతీసియుంచి మిగిలినభాగమునుండి భిక్షమునిచ్చి భిక్షువును పంపివేయుదగు వైశ్వదేవము చేయనిదోషమును భిక్షువు పోగొట్టగలడు భిక్షనివ్వనిదోషమును వైశ్వదేవము పోగొట్టలేదు.

## వైశ్వదేవము నారంభించుకాలము.

శేషహోమాంతరము వైశ్వదేవము నారంభించుట శిష్టాచారము కర్మమధ్యమున మరియొక కర్మనారంభింపజనదు కాన వివాహమైన నాల్గురోజులలో నిడియారంభింపదగదు పార్వణస్థాలీపాకమైన పిదప వైశ్వదేవము నారంభింపదగునని కొందరియభిప్రాయము అంగుష్ఠపర్వముయొక్క ప్రమాణమునకు సరిగానవదానముజేయదగు యీయామితమునకు నాల్గురెట్లు ప్రమాణము, స్విష్టకృద్ధోమము, కుక్కుటాండ ప్రమాణముగా బలులనుంచదగు ఆహుతిప్రమాణముకంటె ద్విగుణముగా నెమిలిగ్రుడ్డుయొక్క యాకారముగా గ్రాసముండదగు ఆగ్రాసప్రమాణముగానే భిక్షయు దానికినాల్గురెట్లు అగ్రమును దానికి నాల్గురెట్లు హన్తకారమును జెప్పఁబడె.

సుదర్శనకారికయందు ధర్మములయందు జెప్పఁబడిన వైశ్వదేవమును ప్రసంగవశమున చెప్పుచున్నాను. వివాహముపూర్తియైనపిదప పండ్రెండు దినములు దంపతులు అధశ్శయనము, బ్రహ్మచర్యము క్షారలవణవర్జనము మొదలగు నియమముల నవలంబించియుండి పదమూడవదినమున నుపవసించి పదునాల్గవదినమునగాని ; తారాచంద్రబలయుక్తమగు మరియొకదినమునగాని పత్నితోగూడ ఈవెనుక చెప్పబడిన వ్రతమునాచరించినపిదప వైశ్వదేవము చేయవలయు అన్నసంస్కర్త (అన్నమువండినవాడి) అన్నము సిద్ధమైనపిదప 'భూతం' అని యజమానునితో నిలిచియుండి పలుకవలయు అపుడు యజమానుఁడు తత్సుభూతం విరాడన్నం తన్మాక్షాయి అని పలుకవలయు ఔపాసనాగ్నిలేనిచో పచనాగ్నియందు వైశ్వదేవముచేయునగు భుజింపదగినయన్నము నే హోమార్థమై యగ్నిసమీపమునసుంచి యొకపాత్రమున హవిష్యమును (క్షారలవణ సంసర్గములేని యన్నమును) కొంచెముగానుంచి మరియొకపాత్రమునందు అహవిష్యమున (దొకాదులతోకలసిన యన్నము) నుంచి ఇష్టే దేవయజ్ఞార్థమై మూడవభాగమును అగ్రదానముకొరకై నాల్గవభాగమును మనుష్యయజ్ఞార్థమై ఐదవభాగమును విభజించి ప్రాతఃకాలమున "ప్రాతర్వైశ్వదేవేన యక్ష్యే" అనియు సాయంకాలము "సాయంవైశ్వదేవేనయక్ష్యే" అనియు సంకల్పించి, అదితేనుమన్యస్వ అని యథావిధిగా పరిషేచించి "అగ్నయేస్వాహా" అనునది మొదలారు మంత్రములచే అంగుష్ఠపర్వ ప్రమాణముగల అన్నమును మొదటగా కల్పింపబడిన హవిష్యమునుండి గ్రహించి పాణిచేతనే వ్రేల్చి పిమ్మట యుత్తరపరిషేచనముచేసి అటుకరువాత అగ్నికియుత్తరమునసున్న వెచ్చనిభస్మమును వెలుపలకుతీసి యందు స్వాకారముచే అహవిష్యమును కొంచెముగా హోమముజేయవలయు. పిమ్మట షడాహుతులు వ్రేల్చగా మిగిలిన హవిష్యము నీయహవిష్యముతోకలపి నూపముతోగలుపబడి ఆయన్నముచే క్రమముగా బలులనుంచవలయు బలులనుంచదగు ప్రదేశమున హస్తముచే సమ్మార్జనముజేసి ప్రోక్షించి ఆబలినుంచి పరిషేచనము జేయవలయు బ్రహ్మసదనము మొదలగు గృహభాగములందచ్చటచ్చట బలులనుంచుటలో నొకభాగమున నేకబలుల నుంచవలసివచ్చినప్పుడు వానినన్నింటినుంచి అంతముననొకమారు పరిషేచనము జేయదగు ప్రతిబలికి నక్కరలేదు. అగ్నికి యుత్తరపరిషేచనము జేసినపిమ్మట "ధర్మాయస్వాహా" "అధర్మాయస్వాహా" అను మంత్రములచే అగ్నికి పశ్చిమమున నుత్తరసమాప్తిగా రెండు బలులనుంచవలయు పిమ్మట "అద్భ్యస్స్వాహా" అనుమంత్రమున నుదకభాండసమీపమున నొకబలి నుంచవలయు "ఓషధివనస్పతిభ్యస్స్వాహా" "రక్షోదేవజనేభ్యస్స్వాహా" అను మంత్రములచే గృహ్యామధ్య

మున రెండుబలులు ప్రాక్సమాప్తిగానుంచి “గృహ్యేభ్యస్స్వాహా అవసానేభ్యస్స్వాహా అవసానపతిభ్యస్స్వాహా సర్వభూతేభ్యస్స్వాహా” అను నాల్గుమంత్రములచే గృహమునకీశాన్యప్రదేశమున ప్రాక్సమాప్తిగా నుంచవలయు “కామాయస్వాహా” అను బలి గృహమునకు దక్షిణభాగమున పయుండెడి ప్రదేశమున నుంచవలయు “అంతరిక్షాయస్వాహా” అను మంత్రముచే గడపయందును “యదేజతి” అను మంత్రముచే తలుపునందునొకబలి నుంచదగు పిమ్మట బ్రహ్మసదనమున “పృథివ్యైస్వాహా” అనునిది మొదలగు మంత్రముచే పదిబలుల ప్రాక్సమాప్తిగానుంచి వాటికిదక్షిణభాగమున ప్రాచీనావీతియై ‘స్వధాపితృభ్యస్స్వాహా’ అను మంత్రముచే దక్షిణమునకు కొంచెము వంచబడిన హస్తముచేనొక బలినుంచి పిమ్మట యుపవీతియై ఆపితృబలికి యుత్తరమున “నమోరుద్రాయ పశుపతయేస్వాహా” అనియొక బలినుంచి, యొకబలినుంచి ప్రాచీనావీతియై మొదటిబలికిన్నీ ఉపవీతియై రెండవబలికిన్నీ పరిషేచనము జేయవలయు పిమ్మట ‘విద్యుదసి’ అను మంత్రముచేయుదకమును తాకి పూర్వ పరిషేచనముజేసి “దేవేభ్యస్స్వాహా” అని హోమముజేసి యుత్తరపరిషేచనముజేసి “వృష్టిరసి” యని యుదకమును తాకి ప్రాచీనావీతియై ‘పితృయజ్ఞేనయక్ష్యే” అని సంకల్పించి ‘విద్యుదసి’ అని యుదకమును తాకి ‘పితృభ్యస్స్వధాస్తు’ అని అంగుష్ఠ తర్జనులమధ్యభాగమునుండి భూమియందు బలినుంచవలయు పిమ్మట ‘వృష్టిరసి’ యని యుదకముతాకి ఉపవీతియై ‘భూతయజ్ఞేనయక్ష్యే’ అని సంకల్పించి ‘విద్యుదసి’ అని యుదకమును తాకి ‘భూతేభ్యఇదం’ అని బలిని భూమియందుంచి ‘వృష్టిరసి’ యని యుదకమును తాకి ఉపవీతిగానుండియే “మనుష్యయజ్ఞేనయక్ష్యే” అని సంకల్పించి విద్యుదసి యనియుదమును తాకి కల్పితాన్నమును బ్రాహ్మణునకొసగి ‘వృష్టిరసి’ యని యుదకమును తాకవలయు గృహమందున్నవారలందరు తృప్తులైనపిదప పాత్రలన్నిటినుండి లేపములతుడచి యుదకములచే నాలేపములకడపి ‘రుద్రాయస్వాహా’ అని యుత్తరమునశుచియగు స్థలమందుంచవలయు సాయంకాలము రౌద్రబలివరకే జేయదగు పిమ్మట “యేభూతా” అనుమంత్రముచే ఆకాశమునసంచరించు పక్షులకొక బలి నొసంగవలయు కొందరు రాత్రియందు వైహాయసబలి నుంచనక్కరలేదని చెప్పిరి. ఛేదించుట భేదించుట వండుట పిండిమొదలగునవి విసరుట నీటిని చల్లుటలనెడి ఐదుతావులుగల్గెడి యైదుపాపముల నివృత్తికొరకీ పంచమహాయజ్ఞములు చేయదగు.

## వైశ్వదేవప్రయోగము.

వృద్ధకృష్ణీయమునందు వివాహమైనపిదప నాల్గవదినము మొదలు దంపతులు అధ

శ్శయనమ్ము బ్రహ్మచర్యము క్షారలవణవర్జనము జేయఁదగు పదమూఁడవరోజున యుపవాసము పదునాల్గవదినమునగాని తారాచంద్రబలయుక్తమగు మరియొకదినముగాని ఔపాసనాగ్నికి పశ్చిమమున ప్రాఙ్ముఖుఁడై కూర్చుండి ప్రాణాయామముజేసి వైశ్వదేవసిద్ధ్యర్థం స్థాలీపాకంకరిష్యే అని సంకల్పించి పర్వులయందు జేయబడుస్థాలీపాకమువలె వైశ్వదేవస్థాలీపాకమును జేసి జయాద్యుత్తరపరిషేచనాంతముజేసి యదిమొదలు జీవించియున్నంతవరకు వైశ్వదేవమును గృహపాకముచే జేయవలయు గృహపాకమునుండి హవిష్యమగు అన్నమును గ్రహించి పాత్రయునందుంచి ఘృతసహితమగు నాయన్నమును ఐదుభాగములుజేసి వైశ్వదేవమునకొకటొక భాగము ఉష్ణభస్మమునందుంచుట మొదలగువానికొకభాగము దేవభూతయజ్ఞార్థమొకభాగమును పితృయజ్ఞార్థమొకభాగమునువిభజించి ప్రాణాయామముజేసి దేశకాలసంకీర్తనపూర్వకముగా పంచసూనదోషప్రాయశ్చిత్తార్థం అన్నశుద్ధిద్వారా ఆత్మశుద్ధ్యర్థం ప్రాతర్వైశ్వదేవేనయక్ష్యే సాయంకాలమునసాయం వైశ్వదేవేనయక్ష్యే అనియుసంకల్పించి ఔపాసనాగ్నియందుగానిపచనాగ్నియందుగానిపరిషేచనముజేసి అగ్నయేస్వాహా అనునిది మొదలుగానారాహుతులహవిష్యమునందలి ప్రథమభాగమునుండిగ్రహించి హస్తముచేవ్రేల్చదగుఇచ్చటదేవతలు అగ్నయేస్వాహా అనునిదిమొదలు నాయవాక్యములయందువచుసగాచెప్పబడినవారేయగుదురు ముందునుఇట్లేయూహింపనగు పిమ్మటయుత్తరమునయున్న యుష్ణభస్మమును వెలుపలనుంచి ద్వితీయభాగమునుండి కొంచెము గ్రహించి యమంత్రకముగా "స్వాహా" యని వ్రేల్చి "అగ్నయఇదం" అని త్యాగముజెప్పి యుత్తరపరిషేచనముజేసి ఒకటి రెండు భాగములయొక్క శేషముగలిపి బలులనుంచదగు యచ్చట బలినుంచదగునో నచ్చట ముందుగా సమ్మార్జనము అవోక్షణము జేయఁదగు వ్రేళ్లయొక్క చిగుళ్ళు భూమిని స్పృశించునటుల బలులనుంచవలయు బలులయందంతటను గంధపుష్పాక్షతలచే పూజించి యమంత్రకముగా పరిషేచనము జేయనగు ఒకప్రదేశమునందుంచబడు బలులకు అన్నిటినుంచి నతరువాత యొకేపర్యాయమన్నిటికి పరిషేచనముజేయదగు అగ్నినికి పశ్చిమమున 'ధర్మాయ' "అధర్మాయ అను రెండుబలుల నుత్తరసమాప్తిగానుంచి యమంత్రకముగా పరిషేచనము జేయువలయు అన్నిబలులయందును అమంత్రకముగానే పరిషేచనము "అద్భ్యః" అని ఉదకభాండముయొక్క సమీపముననుంచి పరిషేచించి గృహమధ్యమున "ఓషధివనస్పతిభ్యస్స్వాహా" "రక్షోదేవజనేభ్యస్స్వాహా" అనియు ప్రాక్సమాప్తిగానుంచి పరిషేచనము గృహమునందీశాన్యప్రదేశమున గృహ్యేభ్యః అవసానేభ్యః అవసానపతిభ్యః సర్వభూతేభ్యః అను నాల్గుబలులు ప్రాక్సమాప్తిగానుంచి పరిషేచించి కామాయ అని పరుండెడితావున

నొకబలినుంచి పరిషేచించి అంతరిక్షాయ అనిగడపయందొకబలినుంచి పరిషేచించి "యదేజతి" అనుమంత్రముచే తలుపునందొకబలినుంచి పరిషేచించి పిమ్మట బ్రహ్మసదనమున 'పృథివ్యైస్వాహా' అనునదిమొదలు మంత్రములచే పదిబలుల ప్రోక్షణమూర్తిగానుంచి పరిషేచించి ప్రాచీనావీతియై ఆబలులకు దక్షిణమున పితృతీర్థముచే "స్వధాపితృభ్యస్స్వాహా" అను మంత్రమున నొకబలినుంచి అప్రదక్షిణముగా పరిషేచనముచేసి ఉపవీతియై యుదకమునుతాకి 'నమోరుద్రాయపశుపతయేస్వాహా' అనుమంత్రమున పదిబలులకు దక్షిణమున పితృబలికి యుత్తరమున మధ్యనొకబలినుంచి పరిషేచించి "యేభూతాః ప్రచరన్తి... తథాతుస్వాహా" అని ఇంటికప్పునొక బలినుంచదగు, పగటిభాగమున "దివాబలిమిచ్ఛన్తః" అనియు రాత్రిభాగమున "నక్తంబలిమిచ్ఛన్తః" అనియు చెప్పఁదగు పిమ్మట దనామి...కామస్సమృధ్యతాం అనియొక్క భాగమును వేదతత్త్వార్థవేత్తయగు బ్రాహ్మణకొసఁగి యుదకమును తాకవలయును పిమ్మట ప్రాణాయామముజేసి దేవయజ్ఞేనయక్ష్యే అని సంకల్పించి "విద్యుదసి" యని యుదకమునుతాకి "అదితేనుమన్యస్వ" అనియగ్నిని పరిషేచించి "దేవేభ్యస్స్వాహా" అనునది మొదలగు నాహుతుల నగ్నిమధ్యను హస్తముచే తృతీయభాగమునుండి గ్రహించి వేల్చి పిమ్మట యుత్తరపరిషేచనము జేయఁదగు.

## గౌణకాలము.

సూర్యోదయమైనపిదప మూఁడుగడియలు ప్రాతస్సంధ్యకును హస్తమించిన పిదప మూఁడుగడియలు సాయంసంధ్యకును పండ్రెండుగడియలతిక్రమించినపిదప మాధ్యాహ్నికసంధ్యకును గౌణకాలము ఈకాలమతిక్రమించినచో శాస్త్రనృష్టమగు మార్గమున ప్రాయశ్చిత్తమొనర్పదగు ఆక్రమము స్మృత్యంతరమున జెప్పఁబడె. ప్రాతఃకాలమున మూఁడుప్రాణాయామములును సంగవకాలమున నాల్గు ప్రాణాయామములును మధ్యాహ్నమున తొమ్మిది ప్రాణాయామములును అపరాహ్ణమున పదునెనిమది ప్రాణాయామములును సాయాహ్నమున ముప్పదియారు ప్రాణాయామములును ప్రాతస్సంధ్యాతిక్రమప్రాయశ్చిత్తముగా జేయఁదగు, సాయాహ్నముగూడ నతిక్రమించినచో సూర్యహత్యనొందు ప్రమాదవశమున నొకదినమున సంధ్యావందనము జేయబడనిచో నొకయహోరాత్రము పదివేలు గాయత్రినిజపింపవలయు ఈవ్రతము నే రెండుదినము లతిక్రమించినచో ద్విగుణముగాను మూఁడురాత్రులతిక్రమించుచో త్రిగుణముగాను యొనర్పదగు ఇంతకును మించినచో శూద్రుడేయగు. మాంద్యము మొదలగు వానిచే కాలయాపనమైనచో దోషము నను చెప్పుచున్నాడు. ఎవఁడు కాలమున ప్రాప్తించిన సంధ్యను మాంద్యమున యుపే

క్షించునో వాడు సూర్యహత్యా పాపమునొందుచు శుద్రుడుగా జన్మించును కేవలబ్రా
అగ్ని బ్రాహ్మణుడు వీరిసంబంధమగు పనియందున్నప్పుడు సంధ్యాతిక్రమమున దోష
మేమాత్రమును లేదు. జాతాశౌచమునను మృతాశౌచమునను సంధ్యావందనము విడువ
జనదు.

## స్మృత్యర్థసారమునందు.

మూడుసంధ్యలు లోపించినపుడు ఎనిమిదివేలు గాయత్రిని జపింపవలయునని
చెప్పబడె. మఱియొక స్మృతియందు మిక్కిలి యశక్తుడగుచో ఒక్కొక్క సంధ్య లోపిం
చినపుడు ఒక్కొక శతము గాయత్రిని జపించుచో తత్ఫలము లభింపగలదని చెప్పబడియె.

## అగ్నికార్యముచేయక భుజించినచో ప్రాయశ్చిత్తము.

అగ్నికార్యముచేయక భుజించిన బ్రహ్మచారి శివాలయమున "మానస్తోకే" అను
మంత్రమును నూరుమారులు జపించినచో నాపాపము తొలగు మరియొక స్మృతియందు సంధ్య
గాని అగ్నికార్యముగాని లోపించినచో స్నానముజేసి యెనిమిదివేలు గాయత్రీజపము
జేయవలయునని చెప్పబడె. క్షితుల్ లోపించినచో పదునారువందలుమాత్రము జపింపవలయు
అబుద్ధిపూర్వకముగా పరిత్యజించినచో ప్రాయశ్చిత్తమును యాజ్ఞవల్క్యుడు జెప్పె. అగ్ని
కార్యమునువదలి భుజించినచో నేడురాత్రులవరకు "కామావకీర్ణిత్యాది" మంత్రద్వయ
ముచే రెండాహుతులు వేల్చి "సంమాసిఞ్చ" అను మంత్రముచే నుపస్థానము జెప్పదగు
ఈమంత్రములు మితాక్షరయందు జెప్పబడె.

## మిక్కిలియశక్తుడై ఈధర్మమును నిర్వర్తింపలేనిపక్షమున.

శివాలయమున "తంవోధియా" అనుమంత్రమును లక్షమారులు జపింపనగు.

## అగ్నిప్రాదుష్కరణకాలము.

సూర్యుని యస్తమయముకంటెను సూర్యుని యుదయముకంటెను పూర్వము ముఖ్య
కాలమని బోధాయనునిచే జెప్పబడుటవలన విహరించినపిదప సూర్యాస్తమయము సూర్యో
దయము అగునట్లు విహరింపవలయు ఇట్లే "అథాధవృక్షసూర్యః" అను నాపస్తంబసూ
త్రమున జెప్పబడినది కాన ఉదయాస్తమయములకంటె పూర్వము అగ్నినుద్ధరించుటకు
కాలముకాదగు ఈప్రాదుష్కరణకాల మతిక్రమించినచో ప్రాయశ్చిత్తము చెప్పబడలేదు
కాన సర్వప్రాయశ్చిత్తమే జేయదగుఅదియెట్లన హోమకాలమునందు అస్తమయముకంటెపూ
ర్వము ప్రాదుష్కరణనిమిత్తపూర్వకం సాయంప్రాతర్హోమం కరిష్యే అని సంకల్పించి

హోమద్రవ్యసంస్కారపూర్వకముగా సంస్కరింపబడిన యాజ్యముచే ఓంభూర్భువస్సువ స్స్వాహా అనిసర్వప్రాయశ్చిత్తము స్రువముచే వేల్చదగు పిదప హోమద్రవ్యసంస్కారపూర్వకముగానపుడు ప్రాప్తించినకాలము జేయదగిన హోమము జేయదగు ఇది ఋత్విగ్విధానమునజెప్పఁబడిన యనుద్ధరణ ప్రాయశ్చిత్తము.

గ్రంథాంతరమునందు.

ప్రాదుష్కరణమనఁగా అగ్నిని ప్రజ్వరిల్లజేయుట ఆకాలమతిక్రమించినచో సమస్తవ్యాహృతులచే నాజ్యాహుతి వేల్చదగునని నారాయణభట్టీయమునందు కాత్యాయనుని వచనము గనిపట్టెనని ఇది స్మార్తానుద్ధరణప్రాయశ్చిత్తవిధి.

స్రుక్స్రువాది ప్రకృతి వృక్షములు.

స్మృత్యర్థసారమునందు మోదుగుకఱ్ఱచే జుహూవును రావికఱ్ఱచే నుపభృత్తును కాండ్రిగుకఱ్ఱచే ధ్రువ నీప్రకారము యజ్ఞమునందుపకరించు స్రుక్కులజేయదగునని లేక అన్నిటిని భుజపత్రపు కఱ్ఱచేనైనను చేయదగు స్రువము చండ్రకొయ్యచేతను ప్రాశిత్రము మేక్షణమును జమ్మికఱ్ఱచేతను రోకలి చండ్రకఱ్ఱచేతను రోలు మోదుగుకఱ్ఱచేతను లేక ఉలిమిరికఱ్ఱచేతను అదియు సంభవింపనిచో మరియొక కఱ్ఱచేగాని జేయింపదగు ముఖ్యమగు ద్రవ్యము లేనప్పుడు తత్సదృశమగు ద్రవ్యము విధింపబడినదికాన నాముఖ్యద్రవ్యమువలె తదసంభవమున నివ్వబడు తత్సదృశద్రవ్యమునుగూడ దేవతలు గ్రహించెదరు. పూర్ణపాత్రమునకును ముసలమునకు స్రువమునకును చండ్రకఱ్ఱ ప్రశస్తము జుహూవునకు పాలాశము ప్రశస్తము అదిలేనిచో యజ్ఞియమగు మరియొక వృక్షముయొక్క కొయ్యచే చేయదగు రెండు ప్రాదేశములకుసరిగా బిలముండవలయు ఇట్టి స్రువములు లభింపనిచో మోదుగుఆకులచే హోమముజేయదగు అవియు లేనిచో రావియాకులచే హోమముజేయదగునని సంగ్రహమునజెప్పఁబడె మరియు "మధ్యమేనపర్ణేనజుహోతి" అను శృతిప్రామాణ్యమున మోదుగుదళమునకు మధ్యనున్న యాకుచే హోమముజేయవలయు. ఒకపక్షమున చమసమును పూర్ణపాత్రమును కాంస్యపాత్రలుకావచ్చు.

దండముండవలసినవిధి.

పాదవును విదుభాగములుజేయగా నందు రెండుభాగములు పాత్రమును మూడుభాగములు దండమును కాదగునని చెప్పెదరు. ఇది ఆయామలక్షణము. పాత్రముయొక్క పాదవులో సగముపాత్రముండవలయు మిగిలినసగము దండముండవలయు ఈసగభాగములో సగభాగము పాత్రముయొక్క వెడల్పును బిలముయొక్క లోతును యుండదగు.

## పంచమహాయజ్ఞప్రాయశ్చిత్తము.

పంచమహాయజ్ఞములలో నొక్కొకటి యొకదినము జేయబడనిచో మనస్వతీహోమము జేయదగు రెండుమూడు దినములతిక్రమించినచో మూడుతంతుమతీహోమములు జేయనగు పిమ్మట మూడురాత్రులపర్యంతము "ఇమమ్మెవరుణ తత్వాయామి యచ్ఛిద్ధితే యత్కించేదం" అను వారుణహోమముల నాల్గిటిని జేయందగు తరువాత అగ్నే భ్యావర్తిన్ అనునిది మొదలగు హోమములుచేయదగు అందు 'అగ్నయె భ్యావర్తినఇదం' అని త్యాగము జెప్పవలయు చరువుచే తంతుమతేష్టిని జేయవలయునని కవివల్లభుండు జెప్పె.

## ఘటశ్రాద్ధకారికలు.

కులహీనయు గర్భపతనము జేసుకొనినదియు పాపాత్మురాలును ద్వైవద్రోహియు ఇట్టిస్త్రీలకు సంస్కారములేదు ఆశౌచము తిలోదకాదులు కుమారునివలన పైతృమేధిక క్రియయు నవసరములేదు, బంధువులాస్త్రీకి ధర్మప్రకారము ఘటశ్రాద్ధము జేయవలయు మనోహారమునందు ఏ స్త్రీ అజ్ఞానమున భర్తను బంధువులను యతిక్రమించి పలువిధములగు మహాపాతకములను జేయునో ఆస్త్రీకి మఱియొక ప్రతిక్రియలేదు కాన ఆమెయొక్క వెంట్రుకలబట్టి తెచ్చి ముఖమును బంధించి అరణ్యమునవిడువవలయు పిమ్మట బ్రాహ్మణులతోను బంధువులతోనుగూడి ఘటశ్రాద్ధముజేయవలయు స్నానముజేసి తనగృహమునకుంబోయి స్వస్తివాచనపూర్వకముగా బ్రాహ్మణసంతర్పణమునుజేసి పిమ్మట యాశీర్వాదముల గొనందగు. హేమాద్రికారుడు మహానదీమధ్యయందుగాని అరణ్యమునగాని చతుష్పథమున (అనఁగా నాలుగుత్రోవలుకలసినచోటున) దేవగృహమునగాని పర్వతాగ్రమునగాని ఘటశ్రాద్ధమును జేయదగు, శ్రోత్రియుడు, దరిద్రుడు, ఋత్విక్కు, దంభములేనివాడునగు తనయాచార్యుని ఇంక నిరువుర బ్రాహ్మణులను కూర్చుండనియోగించి బ్రహ్మవిష్ణుమహేశ్వరుల నావహింపజేసి క్రొత్తకుండలయందు శ్వేతతండులములపూరించి సువర్ణవస్త్రముచేకప్పి యొక్కొక కలశమును తొమ్మిదిదారములచేజుట్టి పూర్వమున నుంచి అందు గోధుమలు, మినుములు, పెసలు, ఒక్కొకటి కుంచము మితిగానుంచి కలశముల ఫలములు బెల్లము, నెయ్యి, తేనె, పాలు, మొదలగునవియు పంచరత్నములు నుంచదగు పాలు, సర్పిస్సు (అనఁగా నెయ్యి) జీరకము (జీలకఱ్ఱ) ఇవి యొక్కొకటి మానెడు ప్రమాణమునను నుంచవలయు ఏలకులు అగరువత్తులు ఇవి యొక్కొకటి పిడికిలిప్రమాణమున నుంచదగు పచ్చియూసిరిగాయప్రమాణమున ఇంగువయు నుంచి బ్రాహ్మణుల నుచితముగు

రీతిని వస్త్రాదులచే నలంకరించి కుండలములు పాదుకలు ఛత్రము ఉంగరము మొదలగునవి యొసగి పూజించి నిష్కముగాని (అనఁగా నూటయెనిమిది సువర్ణములుగాని) వానిలో సగముగాని దక్షిణగానిచ్చి ఆయాకలశములను బ్రాహ్మణులకిచ్చవలయు ఆయిచ్చునపుడు శ్లో॥ కులే మమ సముద్భూతం మయాదత్తమిదం తత్ప్రస్వీకురుష్వ ద్విజముఖే తన్నామస్మరణం పునః అని చెప్పి బ్రహ్మార్పణముజేసి ఆచార్యునకు పాడియావును దక్షిణగానిచ్చి యొక కుండను ప్రదక్షిణమును బంధువులతోఁగూడ జేసి యాకుండను పగులగొట్టి దానిని చూడక యే నదికిఁబోయి స్నానముజేసి గృహమునకువచ్చి సుఖముగా పుణ్యాహవాచనముజేసి పవిత్రమగు పాయసమును భుజింపనగును.

## మరియొకరీతిగా ఘటశ్రాద్ధము.

స్త్రీగాని పురుషుఁడుగాని ప్రమాదవశమున కులభ్రష్టులైనచో వారిని వదలి వర జాహారపూర్వకముగా ఘటశ్రాద్ధముఁజేసినచో నిష్కృతియగు అట్లుచేయనిచో కులమునందు బుట్టినవారందరును పాపాత్ములగుదురు హవ్యకవ్యాదికమున నిందింపబడినవారగుదురు మహాపాతకములచేసి దూషితులై ప్రాయశ్చిత్తములఁజేసికొనుట కశక్తుఁడగుచు మృతినొందినవానికి యుదకక్రియలేదు ఏకాలమందైనను గొప్పపాపమునుజేసి ప్రాయశ్చిత్తమాచరింపనిచో వానిపుత్రులు మొదలగు సపిండజ్ఞాతులు సత్కులమందుఁగలిగిన సంకిలీకరణపాతిత్యము వివరించుటకై వానినుద్దేశించి త్యాగవిధిగా ఘటశ్రాద్ధముజేయఁదగు.

## ఘటశ్రాద్ధప్రయోగము.

గురుశుక్రమౌఢ్యరహితమగు జ్యోతిశ్శాస్త్రమునెరిగినవానిచె జెప్పఁబడిన మంచి దినమున వేదశాస్త్రములయందు సమర్థులగునట్టియు నాల్గుశాఖలయందు జనించినట్టి యశిష్టులగునట్టియు శ్రోత్రియులను రావించి తాను త్యాగముచేయుటకు నిమిత్తమును వారికి తెలియజేసి తనగృహమును పుణ్యాహవాచనాదులచే శుద్ధిపరచి తనగ్రామమునుండి బయలువెడలి మహానదియందుగాని దేవగృహమునగాని యీవిధి నెరవేర్పనగు స్నానముజేసిపరిశుద్ధురాలగు తెల్లని వస్త్రమును ధరించిన యొకదాసిని గంధమాల్యాదులచే నలంకరించి చిల్లిలేనియొక క్రొత్తకుండను దెచ్చి తనచేవిడువబడు పాపాత్మునియొక్క లేక పాపాత్మురాలియొక్క గోత్రమును పేరును తనకును వానికినిగల సంబంధమును జెప్పి అన్నియోషధులచేతను ప్రతిష్ఠాశనముచేసియుదకముచేపూరించియమనూక్తమునుచ్చరించుచు ఆఘటమును తాకిదాసియొక్క శిరస్సునందుంచి బంధువులందరితోఁగూడ నాదాసినిముందుంచుకొని గ్రామమునుండితూర్పుగాగాని యుత్తరముగాగాని బయలువెడలి చతుష్పథమునందుంచి ఆపతితునియొక్క గోత్ర

మును నామమును ఉచ్చరించుచు శోకమువలన కన్నీరువిడుచుట మొదలగునవిజేసి పుత్రులు మొదలగు సపిండులు ఘటమునకుమూడుమారులు ప్రదక్షిణముజేసి యందుబలినుంచి తిరిగి గృహమునకు వెళ్లవలెనుపిమ్మట శరీరశుద్ధ్యర్థమై పావమానాది మంత్రములనుచ్చరించుచు పంచగవ్య ఆమలక వారుణస్నానములనాచరించి రాత్రియందుపుణ్యాహమునుచేసి పంచగవ్యహోమముజేసితత్ప్రాశనజేసితరువాత ఘటశ్రాద్ధము విరజాహోమమును వ్యాహృతి హోమములుజేసి విష్ణు,రుద్ర,యమ,బ్రహ్మ,సవితృ,దుర్గా, గణేశాదులనుద్దేశించి హవ్యములు నెయ్యి శమీకాష్ఠములు తిలలు గరిక మొదలగువానిచే నొక్కొకదానికి ఎనిమిదిమారులవంతున తనగృహ్యసూత్రమునందు చెప్పబడినరీతి హోమముజేయవలెను పిమ్మట పరహోమాంతమున ఎనిమిదిపిండములుచేసి అగ్ని [illegible] మునసటిసాయంత్రకాలమున మునుపుగాని పిమ్మటగాని [illegible] బ్రాహ్మణాల భుజింపజేయవలెను ఇది ఘటశ్రాద్ధప్రయోగము.

## అనుద్ధరణప్రాయశ్చిత్తము.

అగ్నినుద్ధరింపకమునుపు సూర్యుడుదయించినను అస్తమించినను [illegible] ప్రాయశ్చిత్తమునాచరింపవలెను సాయంకాలమున హిరణ్యమును పురస్కరించుకొని యగ్నినుద్ధరింపవలెను. హిరణ్యము జ్యోతిస్స్వరూపము కాన ఆహిరణ్యమును ప్రణోభాగమునుంచినయెడ సూర్యుడున్నటులేయగు ప్రాతఃకాలమున రజతమునుగ్రహించి యుద్ధరింపవలెను రజతము రాత్రిరూపమైనదిగాన తత్సన్నిధానమున రాత్రినతిక్రమించిన దోషముపోవునని తెలియదగును.

## సంధ్యాదులయందు జపవిధి.

అనామికాంగులి మధ్యపర్వవారంభించి ప్రదక్షిణక్రమముగా తర్జనియొక్క మూలపర్వమువరకు గాయత్రీజపము నాచరింపవలయును.

## దా న ల క్ష ణ ము .

కన్యాదానము, గోదానము, దాసీదానము, వృషభదానము, గజదానము, వీటియందు ప్రతిగ్రహీత పశ్చిమాభిముఖుండై నిలచి గైకొనవలయును గుఱ్ఱమును చెవియందు, యేనుగును దంతమునందు, దాసిని కేశములయందు, మేకను కంఠమునందు, గోవునుతోకయందు, వృషభమును మూపురమునందు, ఎనుమును కొమ్ములమధ్యను కన్యను హస్తమునందును పశ్చిమాభిముఖుండై గ్రహింపవలయును.

ఇధ్మతంత్రరహితములగు కర్మలయందాఘారములు చక్షుస్సులులేవు ఇధ్మతంత్ర

ముతో గూడిన అన్ని కర్మలయందు నాఘారములు చక్షుస్సులు గలవు పుత్రుఁడు జనించి నపుడు పుణ్యాహవచనయమున పత్నియు పుత్రుఁడును వామభాగముననుండవలయును. తదితర కార్యములయందు "వధూంసమేత్య" అనునది మొదలగు మతమునననుసరించి కూర్చుండఁదగు.

## శ్రాద్ధమున అగ్నౌకరణలోప ప్రాయశ్చిత్తము.

అగ్నౌకరణము జేయమరచి భోక్తల భోజనముమధ్యను స్మరించుచో ఆజ్యహోమము జేసి శేషము పాత్రమునసుంచదగు.

## ద్విభార్యా గర్భిణీపతి.

ఇరువురు సభార్యలు గర్భిణులైయుండ నొకభార్య ప్రసవించినచో శుభకర్మను మాత్రము వర్జించి నామకరణాదికము జేయఁదగు.

## ఛాయా న క్త ము .

తననీలువుప్రమాణమునకు రెట్టింపుదూరము తననీడపోవునటుల సూర్యుడు పశ్చిమదిశకరుగ నదినక్తమనఁబడు రాత్రిభోజనము నక్తముగానేరదు ఇది రాత్రిభుజింపగూడని విధవస్త్రీలు మొదలగువారి విషయము.

## గ్రహణమునందు శ్రాద్ధవిధి.

సూర్యుఁడు గ్రస్తుడై యస్తమించినపుడును గ్రస్తుడై యుదయించినను ఆదినముపవసించి మరుసటిదినము శ్రాద్ధముజేయఁదగు.

## శాఖారంభ విషయము.

ఒక వేదమునందలి శాఖలయొక్క మధ్యను తనసంబంధమగు శాఖను పరిత్యజించి ఇతరశాఖనవలంబించుట శాఖారంభమనఁబడు.

## నిత్యోపాసనకుండము.

నిత్యహోమమునందు రెండెమేఖలములతో గూడినట్టియు అరత్నిపరిమాణము గలిగినట్టియు పండ్రెండంగుళముల యెత్తుగల కుండము నిర్మింపదగును.

## జీర్ణోపవీత విసర్జనశ్లోకములు.

శ్లో॥ ఉపవీతంఛిన్నతంతు జీర్ణకంమలదూషితం। విసృజామిపరబ్రహ్మన్ వాచో దీర్ఘాయురస్తుమే॥ ౧॥ పవిత్రవస్త్రంయదిజీర్ణవస్త్రం వేదాంతవేద్యం పరబ్రహ్మసత్యః। జయుద్వ్యవగ్ర్యం ప్రతిముంచశుభ్రం జీర్ణోపవీతంవిసర్జస్తుతేజః॥

ఈరెండుశ్లోకములనుచ్చరించుచుజీర్ణమగు యజ్ఞోపవీతమును విసర్జింపనగు.

## వివాహమధ్యను అమావాస్యా చతుర్దసులు సంభవించినచో.

నాల్గవదినమునకులోగా చతుర్దశిగాని అమావాస్యగాని వచ్చినచో నాదినమున శేష హోమము జేయక మరుసటిదినము తంత్రిమంతయు నెరవేర్పఁదగు ఆజ్యమును సంస్కరించి నొకమారువంతున గ్రహించి అనాజ్ఞాత హోమత్రియముజేసి చతుర్హోతచేతను భూర్భువాది మంత్రిములచేతను హోమముజేసినపిదప శేషహోమము నారంభిఁపనగు.

## పత్నీపుత్రస్థానవిధి.

జాతకర్మ, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, వివాహము, సీమంతము, ఆధానము, పుంసవనము, ఈకర్మలయందు కర్త యెడమవైపునను పత్నియు పుత్రుఁడును కుడివైపునను యుండఁదగు కన్యాదానము, శ్రాద్ధము, యజ్ఞము, చంద్ర దర్శనము ఈకర్మలయందుగూడ వెనుకటివలెనే కూర్చుండదగు.

## లాజహోమము.

దోసిలియొక్క ఎడమప్రక్కనుండి లాజహోమముజేయఁదగు అగ్రమునుండి హోమముజేసినచో వధువు విధవయగు కోణమునజేసిన మధ్యమపక్షము, కాన అగ్రమునుండియు కోణమునుండియు లాజలనుంచజనదు. లాజహోమకాలమున యముఁడును, మృత్యువును యుండెదరు కాన దంపతులయొక్క రక్షణార్థమై బ్రహ్మ వెలుపలనుండగా "సోమాయ" అను ఆజ్యాహుతికి పరమున బ్రిహ్మఘ్నులకు ప్రిదక్షిణముజేసి లాజహోమము జేయఁదగు.

## గ్రంథివిసర్జన హోమలక్షణము.

శ్రౌతమునందు శుల్బమును రజ్జువును శ్రావణపూర్ణిమనాడుపవీతము ముడివిడదీసియే హోమముజేయవలయు, ముడితో జేయరాదు.

## చౌలలక్షణము.

వసిష్ఠగోత్రిజులకు కుడివైపున భారద్వాజగోత్రజులకు అత్రికశ్యప గోత్రజులకు యెడమవైపునను చూడాకర్మ శుభప్రిదము, గాలవగోత్రిజులకు మధ్యభాగమున నుండ

నము జెప్పఁబడె. భృగువంశజులు, ఆంగీరసులు పంచశిఖలనుంచుకొనెదరు మిగిలి[illegible] కానీమములేదు. ఋషిసాంప్రదాయము ననుసరించి శిఖలనుంచుకొనఁదగు వివా[illegible] ఉపనయనము, స్నాతకము, పుంసవనము, సీమంతము, శతాభిషేకము వీటియం[illegible] బంధనము విధింపఁబడె కాన దంపతులకు యోక్త్రబంధనము చేయవలయు మౌంజీబంధనము వటువునకుమాత్రమే మునులచే జెప్పఁబడె.

## ఆజ్యపాత్రస్థాపన క్రమము.

వివాహము, చౌలము, సీమంతము, వేదవ్రతములు, స్నాతకము, గోదానము, పునస్సంధానము, వాస్తుహోమము, ఆగ్రియణము, శాంతిహోమము, వృషోత్సర్జనము, మొదలగువానియందు అగ్నికి పరిస్తరణలకు మధ్య నాజ్యసంస్కారము చేయవలయు.

## లాజహోమవిధి.

వ్రేళ్లనువిడదీసి లాజహోమముచేయజనదు కన్యకయొక్క కనుబొమల మధ్యయందు రుదంతియను రాక్షసియుండు ఆరాక్షసియొక్క వధార్థమై పశ్చిమమున దర్భనుంచదగు.

## —♦ దశాంగధూపము. ♦—

## —♦ అగ్నిచక్రశుద్ధి. ♦—

అను ఈ రెంటికిని తాత్పర్యము సర్వత్ర తెలిసినవిషయమే గనుక విస్తరించలేదు.

## బృహస్పతిస్థాన నిర్ణయము.

శ్లో॥ బృహస్పతిస్సదాతిష్ఠే ద్దిశ్యోదీచ్యాంసమాహితః।
స్మార్తకర్మసు సర్వత్రనిశ్చితోక్తం కపర్దినా॥

## యోక్త్రదర్భలు.

శ్లో॥ త్రింశద్దర్భైఃకృతంయోక్త్రం ద్వాత్రింశదంగుళాయుతం।
అష్టావింశతిదర్భైర్వా జ్ఞేయంయోక్త్రస్యలక్షణమ్॥

గ్రంథము సంపూర్ణము.